శ్రీ

# భక్తహృదయము



గ్రంథకర్త:—పొన్నూరు బాపయ్య.

భారతీ ప్రెస్, తెనాలి.

ఓం

శ్రీ బోధానంద సద్గురు పరబ్రహ్మణేనమః

శ్రీ

# భక్తహృదయము

మల్లేశ్వర స్తవము.

పండిత పరిష్కృతము.

రచయిత

పొన్నూరు బాపయ్యశర్మ.

[illegible]

వెల రు. 0—4—0.

# చిన్నమాట.

సుమారు రెండు సంవత్సరములక్రితము మాయూరనుండు భక్తకామధేనువగు శ్రీమల్లేశ్వరునిపేర భక్తహృదయమను సీసశతక మొందు రచించినాడ. ఈ యార్థికపరిస్థితులచే ముద్రణమునకై యింత కాలవ్యవధిపట్టినది. బాలకవిత్వమగుట దొసగులు పొసగవచ్చును. వాటిపట్ల కవిరాజులు రాజహంసలగుదురుగాత ! పరమేశ్వరుని యసాధారణప్రేమయే యీనా యుద్యమమును కొనసాగించినదని నమ్ముచున్నాడ.

దొప్పలపూడి,
భావ
మహాశివరాత్రి. } రచయిత.

# పరిచయము.

తీరుతీయములుకలిగి మురిపెముల ప్రోదిసేయు నాంధ్ర సారస్వతరంగమున కావ్యేందిర నైకవిధలాస్యవిన్యాసరీతుల ప్రదర్శించినది. అష్టాదశవర్ణనోపలక్షితమగు మహాకావ్యములతోఁబాటు ఉపకావ్యములుకూడ భాషాయోషకు భూషలై అందగించినవి. ఈ భక్తహృదయ మట్టి యుపకావ్యపరంపరలో చేరినదే.

"అసర్గబంధమపి యదుపకావ్యముదీరతే" అని లాక్షణికుల నిర్వచనము వారిపరిగణనమున సూర్యశతకాదు లుపకావ్యములు పరిమాణమునందు మహాకావ్యములకన్న నివి చిన్నవియే యయ్యును,రచనావిన్యాసమందేమి—భావసౌభాగ్యమునందేమి—శబ్దార్థవిలసనమందేమి—చాటూక్తి చమత్కారమునందేమి—వానితోఁ దులతూఁగఁజాలినవియు కొన్నియెడల మించఁజాలినవియు నున్నవన్న నత్యుక్తి కాదేమో! కావుననే ఆంధ్రకవులిట్టి యుపకావ్య విరచనమునకు మొదటి యుగము నుండియు కడంగిరి.

ఈ యుపకావ్య పరంపరను పరిశోధించితిమేని వీని యందలి వస్తువుకూడ భిన్నముగా కన్పట్టుచున్నది. నీతిని వస్తువుగా నిబంధించినవి కొన్ని, హాస్యమును స్వీకరించినవి మఱికొన్ని, కరుణ నవలంబించినవికొన్ని, చమత్కారము నాశ్రయించినవికొన్ని, భక్తిప్రతిపాదకమైనవికొన్ని. వీనియందు చాలా వఱకేదేనొక మకుట మనుసంధిపఁబడియుండును. అట్లనుసంధింపనివియు కొన్నికలవు.

ఈ భక్తహృదయమట్టి యుపకావ్యమని మున్నే చెప్పి యుంటిని. ఈశ్వర స్తోత్ర పరాయణ మగుటచేతను అప్పుడప్పుడు కలిగిన భక్తిభావపరంపరను వెలార్చుటచేతను, ఎడనెడ భక్త హృదయమున కలుగు నుద్వేగమును—తీవ్రతను స్ఫురింపఁ జేయుటచేతను, నిఖిలమధురోదారభావనిలయమగు భక్త హృదయమును ప్రతిబింబింపఁజేయుచు ఇది తనపేరునుఁ సార్థక మొనర్చుకొనుచున్నది.

ఇందలి పద్యములు చాలావఱకు స్తోత్రములు: కొన్ని హృదయనిలీనమగు భక్త్యావేశమును సూచించును. మరికొన్ని ప్రకృతి స్వభావచాంచల్యమును నిరూపించి హృదయస్థైర్య మును యాచించును. ఇఁక గొన్ని "నాకు దార్ఢ్యనికాది పాం డితీవిలసనము శూన్యము. నీ పాదారవింద స్మరణముతప్ప నన్యమెఱుగను. నన్నెట్లుప్రోచెదవో" యను పరమవిశ్వాస మును సూచించును. మఱికొన్ని ఐహికప్రసక్తుల నదల్చి పార మార్థిక చింతాప్రాబల్యము నుద్బోధించును.

భక్తినుద్బోధించు విశిష్టాద్వైత తత్త్వమునందు ఆత్మా ర్పణభావమే చరమలక్ష్యము. "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణంవ్రజ" అనుటయే ఆదర్శసూక్తి. ఆ సర్వసమర్పణ భావము ఇందింతకన్న విప్పారినేని—ఈ హృదయకుసుమ మింతకన్న మిన్నగా విశిష్టసౌరభముల ప్రసారించెడిది.

ఇది యీకవికి ప్రథమప్రయత్నము అయినను అట్లు కాన్పించుటలేదు. శైలిధారాళమైకుంటువడకసాఁగిపోవుచున్నది.

పద్యములన్నియును ద్రాక్షాపాకముననుండి అర్థసౌలభ్యము నొందియున్నవి రచన చక్కనిపదములతో కూర్పు నేర్పుగలిగి చదువు నింపౌసగుచున్నది. అక్కడక్కడ మాత్రము అనుప్రాసాద్యలంకారములును పదగతచిత్రములును నాతి కఠినములుగ నిబంధింపఁబడినవి. పద్యములు రుచ్యములు మాత్రమేకాక సదాశివస్తుతి పరాయణమగుట ప్రశస్యములు. కావ్యము సహృదయానందసంధాయియగుటకాక మహేశ్వర పాదారవిందనిహితమగుట చరితార్థము. నిక్కముగ భక్తహృదయమునకు — పరమవిశ్వాస సంకలితమగుదానికి—భగవత్పాదారవింద సమర్పణముగదా లక్ష్యము ! అదియే యీకృతికమరిన భాగ్యము.

ఇందు గణింపఁదగిన నెఱసు లేమియు దొరలినట్లు కన్పించదు చాలపద్యములకు ఆవేశభావము ముఖ్యజీవముగ కన్పించుచున్నది. బాలుఁడగు నీ కవి చేయితిరిగి ఇతోధికముగా అనల్పకవితాకల్పనాచతురుఁడుగా సదాశివ ప్రసాదమున పరగి తన మధురరచనలచేత ఆంధ్రవాణీ సముపాసన మొనర్చి. తరించుఁగావుతమని నిండుమనమున ఆసించుచున్నాను.

ఇట్లు
నా—వెంకటేశ్వరశాస్త్రి
విద్వాన్—విద్యావిభూషణ
ఆంధ్రసాహిత్యసరస్వతీ

శ్రీ భావ ఫాల్గుణ
శుద్ధ ప్రతిపత్తు
అమృతపురి.

# పండితాభిప్రాయములు.

శ్రీమన్నిగమాగమ పారావారపారీణ పరమహంస పరివ్రాజకాచార్య సర్వతంత్రస్వతంత్ర వైదిక శైవసిద్ధాంత స్థాపనాచార్య ఆమర్దకశాఖా మణికర్ణికా మఠాధీశ్వర చంద్రమౌళీశ్వర పీఠాధ్యక్ష జగద్గురు

## శ్రీబోధానంద మహర్షులవారు,

శ్రీకంఠమఠః, కోటిపలి.

భక్తహృదయమను మల్లేశ్వర స్తవమును జూచినాడ. ఇందలి సీసపద్యములు భక్తిరసభరితములై, జ్ఞానగర్భితములై, లలితపదబంధురితములై, శ్రవణానందకరములై, ముక్తిదాయకములై యొప్పారుచున్నయవి. ఇందు సర్వదేవాదిదేవుండైన యీశ్వరుని మహిమ వర్ణింపఁబడినది. సర్వమతోత్కృష్టమైన శైవమతమభినందింపఁబడినది. సంసారసాగరము నవలీలగాదాటుటకు నౌకాప్రాయమైనది. యీకవి బాలుండయ్యును మృదు మధురశైలితో శబ్దాలంకారములతో మనోహరమైన పద్యములు వ్రాసినందుకు సంతసించినారము. (ఇందు కవియొక్క వంశావళి వ్రాయకపోయినను యీతను శైవమతస్థుండైనట్లును శ్రీకంఠ శివాచార్య గురుసంప్రదాయుండైనట్లును శివావతార దూర్వాస సంతతిలోని బ్రాహ్మణుండయినట్లును మాపాఠకులకు గోచరింపకపోదు.)

[ఆంగీరస, ఫాల్గుణము.] [సం] బోధానందమహర్షి.

ఆంధ్రదేశమునకు చిరపరిచితులును, సుప్రసిద్ధాంధ్రకవులును
నగు బ్రహ్మశ్రీ

# మంగిపూడి వేంకటశర్మగారు.

మహాశయా !

తాముదయతో పంపిన భక్తహృదయము ఆనందముతో పఠించినాను. మృదుమధురమైన మీకవిత హృదయాహ్లాద కరముగానున్నది. శైలిధారాళమై సొంపుగానున్నది. శైవసంబంధములైన అనేకసంప్రదాయములు బహుకృషివల్ల సంపాదించి కూర్చిన మీపరిశ్రమ మీశివభక్తికి తార్కాణముగానున్నది. దేశోపయోగకరములగు అనేకగ్రంథములను రచించి ఆంధ్రభాషాయోషనలంకరించి మీకవితను సార్థకము గావించుకొందురుగాక! యని కోరుచున్నాను.

నిడుదవోలు.
౯-3-3౫.

[సం] మం॥ వేంకటశర్మ.

శ్రీ పీఠికాపుర ప్రభుపోషితులును, వర్ణనరత్నాకరాద్యనేక గ్రంథకర్తలును నగు,

మహారాజశ్రీ

# దాసరి లక్ష్మణస్వామికవిగారు,

# పిఠాపురము.

కవివర్యా !

సౌహార్ద్ర పూర్వకముగా మీరొసగిన శ్రీభక్తహృదయము అను గ్రంథరాజమును వందనపూర్వకముగా నందికొని పరమాహ్లాదముతోఁ బఠించితిని. అందలి కవనము మృదుమధురమై, ప్రౌఢమై, భక్తిరససంపూరితమై యలరారుచున్నది. సహజపాండిత్యుడగు బమ్మెరపోతరాజ కవీంద్రుని పరమభక్తియు, సర్వజ్ఞుఁడగు నాచన సోమనాధ కవిసింహుని పద్యకల్పనాప్రౌఢియు మరియు ననేక పూర్వకవుల లలితంపుఁ బోకడలును మీ పుస్తకమునఁ బ్రత్యక్షములగుచున్నవి.

జగదీశ్వరుఁడగు పరమేశ్వరుఁడు మీ కాయురారోగ్య భాగ్యాదులఁ బ్రసాదించి యితోఽధికమగు మేలికవనమును బ్రౌఢప్రబంధరచనాశక్తియుఁ బ్రసాదించి మిమ్ము సుయశోవంతులఁ జేయుఁగాక యని యనేకవిధములఁ బ్రార్థించుచున్నాఁడను.

8—3—35, [సం] దాసరి లక్ష్మణస్వామి.

ఓం

శ్రీ భక్తహృదయము అను నీశతకమును నేడు చూడఁ దటస్థించినందులకు సంతసిల్లుచున్నాఁడ. గాఢమైనశివభక్తి ఇందుఁ బ్రతిపాదితమైయున్నది. కవితాధార ధారాళముగా బ్రవహించుచున్నది. వర్ణనసామగ్రి బహుగ్రంథ పరిశోధన పరిశ్రమను జాటుచున్నది.

తా నందందు సూచించుకొనినట్లు గ్రంథకర్త బాలుండయ్యు గ్రంథమును సర్వాంగసుందరముగా దిద్ది తీర్చెననుట సత్యదూరముకాదు. ఈబాలకవి ఇతోఽధిక భాషాసేవ చేయునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాక !

8–3–35 }
అమృతలూరు } ఉభయభాషాప్రవీణ
ప్రతాప రామకోటయ్య.
ఆంధ్రోపాధ్యాయుఁడు జి. సి. హైస్కూలు, తురుమెళ్ల.
P. O. L.

భవ్యమ్

భక్తుఁడగు నీబాలకవిచే రచియింపఁబడిన భక్తహృదయమును పఠించుభాగ్యము నాకబ్బినది. కవికిది ప్రాథమికమయ్యును కవిత్వము నాతికఠినమై మృదుమధుర పదమంజులమై భక్తిరసామృతము నొలుకుచున్నది. ఈకవి భక్తబృందావన పరాయణుడగు భవానీ భర్తను బాగుగా వర్ణించినాడు. పరమేశ్వరానుగ్రహమును బడయఁగోరు ప్రజలెల్లరకును నీపొత్తము ముఖ్యపాఠ్యముగ నున్నది.

అమృతలూరు. }
11–3–35 } ఇట్లు రాజవైద్య
నాగలింగమ్ — రాఘవశర్మ.

పరమభాగవతాగ్రగణ్య, అభినవప్రహ్లాద, భక్తిమూర్తేత్యాది బిరుదాంకితులును, కృష్ణా గుంటూరుమండలాంతర్గత శ్రీసనాతన భాగవత భక్తసమాజ కార్యదర్శిగారును, నగు

బ్రహ్మశ్రీ పండిత

# ములుకుట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారు,

ఈశతక రచయిత వయసునఁ జిన్నవాఁడయ్యును స్వాశ్రమోచిత కర్మానుష్ఠాన తత్పరుండును, అనవరత శ్రీ సదాశివ ధ్యానతత్పరుండు నగుటచేఁ దన భావమును, పరమేశ్వరునకును భక్తప్రపంచమునకును వెల్లడింపనెంచి యీశతకమును రచించె. అదియుంగాక నూత్నసంజాతయగు నీ కవితాకన్య బాలికయయ్యు నైపుణ్యముచే ప్రౌఢలక్షణములు గాన్పించుచున్నవి. భక్తి భావరసపూరితమగు నీశతకమున నెచ్చటనైనఁ ఛందోవ్యాకరణాది దోషము లించుక కనుపించినను పాఠక పరమహంసలు నీరక్షీరవిభాగచాతురీధురీణతను వహించి యీశ్వరానుగ్రహపాత్రునిగా కవి నాశీర్వదించి సంతసింతురని కోరుచున్నాఁడను.

దొప్పలపూఁడి. [సం] ములుకుట్ల లక్ష్మీనారాయణశాస్త్రీ.

శ్రీ భక్తహృదయమను సీసశతకమును దొప్పలపూడి గ్రామములో వేంచేసిన శ్రీ మల్లేశ్వరస్వామిపై చెప్పఁబడినది. అతిహృద్యమగు శైలితో పండిత పామరరంజకముగా భక్త్యావేశముతో మన్మిత్రులగు శ్రీ పొన్నూరు బాపయ్యగారు రచించినారు. ఇందు నచ్చటచ్చట ప్రబంధశైలియు చిత్రకవిత్వాది లక్షణ లక్షితంబులును నొప్పుచున్నవి. పాకము గోస్తనీ రసమయంబై భక్తిరస ప్రధానంబై చదువరుల హృదయంగమంబై యొప్పుచున్నది. ఈ కవి బాలుఁడయ్యు ప్రౌఢభావములతో నీ శతకము నింపుట ముదావహమైయున్నది. పరమేశ్వరుఁడు వీరి నోటనుండి అనేక కావ్యములు పలికించి లోకమున యశస్సు నిండించుగాక !

మునికోటిపురం
౨౦-౨-3౫

చోడవరపు
ఆదినారాయణమూర్తి

ఆర్యా

నేడే మీగ్రంథమందినది. మీరొసంగిన వ్యవధి ననుసరించి భక్తహృదయమును గొంతగొంత కనుగొంటిని. అందు వాక్రుచ్చిన్, సర్వజిత్, దివ్యరూపు మున్నగు వ్యాకృతి విరుద్ధ ప్రయోగములున్నను ధారాశుద్ధి మాత్రము కలదని చెప్పవచ్చు.

బాపట్ల
7-2-35

[సం.] తుమ్మల సీతారామమూర్తి చౌదరి,
ఉభయభాషాప్రవీణ.

'శ్రీ భక్తహృదయమను' నీ సీసపద్యశతకమును మేము దిలకించితిమి. ఇయ్యది వివిధ భావానుభవ పరిశోభితమును సహృదయ హృదయంగమమును నై యలరారుచున్నది. మణి సూత్రన్యాయముగా గ్రంథమంతటను భక్తిరసము వ్యాపించి యున్నది. కృతికర్తయొక్క ప్రపంచానుభవ సామర్థ్యముల నిందలి పద్యములే వేనోళ్ల జాటుచున్నవి. అచ్చటచ్చట నీతి మత వేదాంతములు వెలయింపఁబడినవి. ఇక్కవి చూపిన రచనా వైదుష్యము శ్లాఘాపాత్రము. ప్రథమప్రయత్నముననే యిట్టికౌశలమును గాంచగల్గిన యీరచయిత యచిరకాలము ననే కవితాప్రపంచమునం దున్నతస్థానము నలంకరింపఁ గలఁ డనుట యతిశయోక్తిగానేరదు.

ఇట్లు
ఉభయభాషాప్రవీణ
బూరుగల సత్యనారాయణశాస్త్రి.
బూరుగల సూర్యనారాయణశాస్త్రి

అమృతలూరు.
10-3-1935.

# ఆశంస్స

శ్రీమదాంధ్రాధ్యాత్మరామాయణాద్యనేక గ్రంథకర్తలును,
నిడుబ్రోలు స్థానికోన్నతపాఠశాలా ప్రధానోపాధ్యా
యులును, ఉభయభాషాప్రవీణులును నగు

## బ్రహ్మశ్రీ పిశుపాటి నారాయణశాస్త్రిగారు,

ఈ భక్తహృదయమును ముద్రణదశకు రాకపూర్వమే నేను సమగ్రముగా జదివియుంటి. వయోదశవోలెఁ గవితా దశయుఁగృతికర్తది ప్రాథమికము. 'ప్రవర్తనముపగిదిఁగవికిఁగల భక్తియు నిరాడంబర'మను సంగతి గ్రంథమందంతటను గన్పట్టు చున్నది. పద్యములు చాలావఱకు ధారాశుద్ధిగలిగి కుంటు వడక భగవద్వర్ణనా ప్రతిపాదకములై భాసిల్లెడి భాషావిషయ కములు, లాక్షణికములునగు నెరసు లెంచేనున్నను, నంత కంటె వేయి మడుంగులుగా దీపించు సుగుణ పరంపరలో నవి యిమిడిపోయినవి. ఇక్కవికిశోరము సదా సదాశివానుగ్రహ సంపదం జేసి, యితోఽధిక కవితా సామగ్రియుఁ బారమార్థిక భావమును బడసి, యచిరకాలమ్మునన లోకమునకుఁ జిరపరి చయుండగుఁగాక!

పొన్నూరు.
15—4—35.

(సం) పిశుపాటి నారాయణశాస్త్రి

# శ్రీకంఠశివాచార్యస్తుతి.

శ్రీకంఠవంశోదధి పూర్ణచంద్రం । శ్రీకంఠశాస్త్రార్థవిదం మునీంద్రమ్।
శ్రీకంఠదేశాంచిత యజ్ఞసూత్రం । శ్రీకంఠమాచార్య మహంభజామి॥ ౧

శ్వేతాహ్వయాచార్య పదారవింద । ద్వంద్వార్పణానందిత చిత్తభృంగమ్॥
జటాకలాపోల్లసితోత్తమాంగం । నమామితంయోగి మనోభిషంగమ్। ౨

వ్యాసస్యసూత్రంవిదుషాం సునేత్రం । బ్రహ్మైవలోకేసమలం పురాఽభూత్॥
అకారియేనామలమాత్మశక్త్యా । ధ్యాయామితందేశిక మప్రమేయమ్॥ ౩

ఆమర్ద్దభూమీధరమస్తకేయ । శ్చిరంన్యవాసీన్నియతో జితాత్మా॥
జిజ్ఞాసురాధ్యాత్మిక తత్వమైశం । మాంపాతుదత్వాస గురుర్భృశంశమ్॥ ౪

కలేర్మహిమ్నా భువనేప్రవృద్ధే । మోహాంధకారే తరసాపనేతుమ్॥
తంబోధధామ్నా మహతావతీర్ణం । శ్రీకంఠనామ్నా శివమాత్మనీడే॥ ౫

దక్షేణహస్తేన సుయోగదండ । స్థితేన దివ్యాఽమలినాక్షమాలామ్॥
వామేనచ జ్ఞానమయప్రబోధం । బిభ్రాణమాచార్య మహంప్రపద్యే॥ ౬

పద్మాసనస్థాచల పూర్వదేహం । తపోబలవ్యాప్తి నిరస్తమోహమ్॥
స్మరామిభక్త్యాహృదయేనసోఽహంకృత్వాఽద్యహృద్యత్సమనస్సమూహం ౭

గోదావరీదివ్యనదీ తటస్థే । కాశేశ్వరేమంథన పూర్వశబ్దే॥
శంభుంమనస్సంస్మర మేరుధీర । మాచార్యరూపేణ కృతావతారమ్॥ ౮

సంసారదావానల కాలమేఘం । హింసాదిపాపాల్పసరోనిదాఘం॥
ఆచార్యపాదం కలయామిచిత్తే । వాచాతిగామేయ విభూతిమార్యమ్॥ ౯

మహానుభావం ద్విజమాదిశైవమ్ । మోహాటవీదాహ సమిద్ధదావమ్॥
సంసార వార్థ్యుత్తరణైకనావమ్ । సంస్తౌమ్యజస్రం హృదిభక్తియుక్త్యా॥ ౧౦

౧

శ్రమలకోర్చి కనిపెంచి ♦ సంతసమున
పెద్దవానిఁగ జేసి స ♦ త్ప్రేమ చదువు
సంధ్యఁ జెప్పించి నాక్షేమ ♦ సరణి నరయు
జనని జనకుల భక్తితో ♦ సన్నుతింతు.

వేడ్కతో నక్షరాభ్యాస ♦ విధి మొదలుగ
నేఁటి దనుకను సత్కృపా ♦ నిరతులగుచు
జ్ఞానమును నాకు గూర్చిన ♦ జ్ఞాననిధుల
దేశికస్వాములను బ్రస్తు ♦ తింతు భక్తి.

చిత్రంబులు, అఘవల్లీ
దాత్రంబులు, భక్తలోక ♦ తారకలీలా
పాత్రంబులు, కవివర్గా
చ్ఛత్రంబులు, ఫాలనేత్రు ♦ చారిత్రంబుల్.

కామంబులు, బహుదురిత వి
రామంబులు, రాజయోగ ♦ రమణీయకళా
ధామంబులు, సద్భక్త
క్షేమంబులు, శంభుదేవు ♦ శ్రీనామంబుల్.

స్ఫురణంబులు, వేదాంత వి
హరణంబులు, ఘోరపాప♦ హరణంబులు, సం
స్కరణంబులు, సంసార సు
తరణంబులు, రజతశైలధవు ♦ స్మరణంబుల్.

పావనములు, నిర్జర సం
జీవనములు, చిత్కళావి♦ శేషజ్ఞ విశా
లావనములు, శోభన సం
భావనములు, చంద్రమౌళి ♦ పదసేవనముల్.

లక్షణములు, నిగమార్థ వి
చక్షణములు, నైజగర్భ♦ సంభరిత జగ
ద్రక్షణములు, మధురసుధా
భక్షణములు, శూలిసత్కృ ♦ పావీక్షణముల్.

(సానందోపాఖ్యానము.)



శ్రీమహాగణాధిపతయేనమః.

# శ్రీ భక్తహృదయము



లకు నెలవులై ♦ చెన్నొందు భవదీయ
పదపంకజములకుఁ ♦ బ్రణతిఁ జేసి
విఘ్నప్రహర్తయై ♦ విశ్వస్తుతింగాను
గణనాథు మదిలోన ♦ గణుతిఁ జేసి
కమ్మని పల్కులు ♦ కవులచేఁ బలికించు
పలుకుపూఁబోఁడిని ♦ బ్రస్తుతించి
పద్మాక్షు సేవించి ♦ పద్మాలయను గొల్చి
పద్మాసనాది దే ♦ వతల కెఱఁగి

గీ. శైవభక్తుల నెల్లర ♦ సంస్మరించి
కాళిదాసాది సంస్కృత ♦ కవుల నెన్ని
ఆంధ్రసుకవీశ్వరులకు జో ♦ హారులొసఁగి
సీసశతకంబుఁ జెప్పెదఁ ♦ జిత్తగింపు
బుధజనోల్లాస! దొప్పల ♦ పూఁడివాస!
భక్తహృదయేశ! మల్లేశ! ♦ పార్వతీశ!

సీ. భవదీయ సత్కృపా ♦ పాత్రుఁడౌటనుగదా
గరుడవాహనుఁడు చ ♦ క్రమునుగొనుట
భవదీయ సత్కృపా ♦ పాత్రుఁడౌటనుగదా
పాండుపుత్రుఁడు పాశు ♦ పతముగొనుట
భవదీయ సత్కృపా ♦ పాత్రుఁడౌటనుగదా
శుకుఁడు దత్త్వసుధను ♦ చూఱగొనుట
భవదీయ సత్కృపా ♦ పాత్రుఁడౌటనుగదా
జనకుండు వరశరా ♦ సనము గొనుట

గీ. కాన భవదీయ కృపగల్గు ♦ మానవులకుఁ
గరతలామలకంబు కాఁ ♦ గలదు కోర్కి
బుధజనోల్లాస! దొప్పల ♦ పూఁడివాస!
భక్తహృదయేశ! మల్లేశ! ♦ పార్వతీశ! 2

వ్యాకరణజ్ఞాన ♦ వైభవం బదిలేదు
పటుతరాలంకృతి ♦ ప్రౌఢిలేదు
లక్షణగ్రంథంబు ♦ లీక్షింపఁగాలేదు
పంచకావ్యజ్ఞాన ♦ పటిమలేదు
శబ్దనిఘంటువుల్ ♦ చవిచూడఁగాలేదు
సత్ప్రబంధంబుల ♦ జాడలేదు
పౌరాణికగ్రంథ ♦ పఠనమేమియులేదు
ఘనచరిత్రలనేని ♦ గాంచలేదు

గీ. కాని భవదీయ సత్కృప ♦ గలదటంచు
వ్రాయ దొరఁకొంటి నెవ్విధి ♦ వ్రాయఁజేసి
పూర్తిగావించెదో నాదు ♦ పూన్కి వేగ
బుధజనోల్లాస ! ......... ! పార్వతీశ ! 3

సీ. బాలచంద్రధరాయ ! ♦ భసితశరీరాయ !
భవనాశనాయ ! తు ♦ భ్యంనమోఽస్తు
పన్నగభూషాయ ! ♦ పావనవేషాయ !
భక్తపోషాయ ! తు ♦ భ్యంనమోఽస్తు
భర్మాద్రిచాపాయ ! ♦ పరతత్త్వరూపాయ !
ఫాలేక్షణాయ ! తు ♦ భ్యంనమోఽస్తు
భావజదమనాయ ! ♦ పర్వతగమనాయ !
పంచవక్త్రాయ ! తు ♦ భ్యంనమోఽస్తు

గీ. అనుచు నిను భక్తిఁ గీర్తింతు ♦ ననవరతము
నెటుల నన్నేలుకొనియెదో ♦ యింకమీఁద
బుధజనోల్లాస !... ... ...! పార్వతీశ ! 4

సీ. జగముల మొకమీఁడ ! ♦ జతలేనిమొనగాఁడ !
జన్నంపుఁ బగవాఁడ ! ♦ జడలవాఁడ !
తెలితా, యిరవుకాఁడ ! ♦ తెల్లజాల్ తలవాఁడ!
తెలితేజి మన్నీఁడ ! ♦ తెల్లవాఁడ !
ప్రన్ననివిలుకాఁడ ! ♦ వెన్నునిచెలికాఁడ !
కొటికలూడ్చినతేఁడ ! ♦ కోడెకాఁడ !
పొడలగింటెమువాఁడ ! ♦ పునుకఁదాల్చినవాఁడ !
కప్పుకుత్తుకవాఁడ ! ♦ గట్టివాఁడ !

గీ. కలకుఁ బొలదిండ్లసూడ ! ము ♦ క్కంటిప్రోడ !
ఇట్టిఁడవటంచుఁ గొనియాడ ! ♦ నెంతవాఁడ !
బుధజనోల్లాస !... ... ...! పార్వతీశ !!

సీ. నీ త్రిశూలము క్రూర ♦ నివహంబుఁ బడఁగొట్ట
తతకార్ముకముగఁ బ ♦ ట్టితివిగట్ట
దారుకావనితలఁ ♦ దగిలి చేసితి రట్టు
అఖిలలోకములు నీ ♦ కాటపట్టు
కనకాంబరుండైనఁ ♦ గనలేఁడు నీగుట్టు
ఒనర కైలాసమే ♦ యునికిపట్టు
పొలుపారు సద్గుణ ♦ పుంజంబులకు నట్టు
భువనముల్ నీవల్లఁ ♦ బుట్టు గిట్టు
గీ. పరమశత్రుల నీశక్తి ♦ పట్టికొట్టు
నన్నుఁ జేపట్టు వేఱుగా ♦ నున్ననొట్టు
బుధజనోల్లాస !.........! పార్వతీశ ! 6

సీ. కరధృతసారంగ ! ♦ కామదర్పవిభంగ !
కరుణాంతరంగ ! కం ♦ కణభుజంగ !
కాత్యాయనీసంగ ! ♦ ఘనజటాధృతగంగ !
కలితశుభ్రాంగ ! సా ♦ గరనిషంగ !
సులలితచర్మాంగ ! ♦ ఖలపద్మమాతంగ !
కైలాసరంగ ! దు ♦ ష్కర్మభంగ !
ఆర్తార్తినిర్వాప ♦ ణానుమోదాసంగ !
విషధర ! నిస్తుల ♦ వృషతురంగ !
గీ. కవి మనః పద్మభృంగ ! నిన్ ♦ గనుఁగొనంగ
ఘనముగా సన్నుతింపంగఁ ♦ గలనె లింగ !
బుధజనోల్లాస !.........! పార్వతీశ ! 7

సీ. జన్మకర్మంబుల ♦ సడలింపఁ బెట్టేవ
భవ్యమౌ నీపాద ♦ పద్మసేవ
సంసారవార్ధి వే ♦ సరదాఁటుటకు నావ
భవ్యమౌ నీపాద ♦ పద్మసేవ
అవగుణతమమునఁ ♦ కవ్వలిదగుత్రోవ
భవ్యమౌ నీపాద ♦ పద్మసేవ
అతులసౌఖ్యంబుల ♦ సతతమిచ్చెడు కోవ
భవ్యమౌ నీపాద ♦ పద్మసేవ

గీ. నన్నుఁజేపట్ట నేజాడ ♦ నున్నరావ
అవ్యయానంద! దేవ! మ ♦ హానుభావ!
బుధజనోల్లాస! ......... ! పార్వతీశ ! 8

సీ. రాజశేఖర! దేవ ♦ రాజసన్నుత! ధర్మ
రాజశాసన! రాజ ♦ రాజమిత్ర!
ధ్యానకల్పిత! మహా ♦ ధ్యానగోచర! ఘన
ధ్యాన తత్పర! గురు ♦ ధ్యానతోష!
జపరూప! జపయుక్త! ♦ జపఫలదాయక!
జపనందితస్వాంత! ♦ జపనిధాన!
ధర్మేశ! ధర్మజ్ఞ! ♦ ధర్మస్వరూపక!
ధర్మనివేదిత! ♦ ధర్మనిలయ!

గీ. పూజ్య! పూజిత! పూజాప్ర ♦ భూతమోద!
కామ! కామద! కామేశ! ♦ కామదళన!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 9

సీ. వేదసంస్తుత! వేద ♦ వేద్య! వేదవినోద!
వేదాంగవిలసిత! ♦ వేదవిహిత!
మంత్రార్థ! మంత్రజ్ఞ! ♦ మంత్రప్రియాత్మక!
మంత్రాధిదేవ! స ♦ న్మాత్రమూర్తి!
యజ్ఞవిచ్ఛేదక! ♦ యజ్ఞఫలప్రద!
యజ్ఞసమర్చిత! ♦ యజ్ఞరాజ!
విద్యాప్రదాయక! ♦ విద్యాప్రభూ! మహా
విద్యానిలయ! భూత ♦ వేద్యసార!

గీ. జ్ఞానమయ! జ్ఞానకల్పిత! ♦ జ్ఞానగమ్య!
శాస్త్రచయనేత! సర్వశా ♦ స్త్రజ్ఞఫలద!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 10

సీ. విశ్వేశ! విశ్వాత్మ! ♦ విశ్వమోహనమూర్తి!
విశ్వసాక్షీ! మహా ♦ విశ్వవాస!
పరమాత్మ! పరమేశ! ♦ పరమ! పరంధామ!
పావనాత్మ! పరేశ! ♦ పరమపురుష!
నిత్య! నిర్వ్యాపార! ♦ నిర్మల! నిర్గుణ:
నిత్యసుఖప్రద! ♦ నిర్వికార!
భూతేశ! భూతాత్మ! ♦ భూతసంభావన!
భూతవిలక్షణ! ♦ భూతియుక్త!

గీ. స్మయవిరహిత! మాయాతీత! ♦ మాప్రదాయ!
యోగసమ్మోద! యోగేశ! ♦ యోగలక్ష్య!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 11

సీ. గురునిమూలమునసే ♦ గురుమతి లభియించు
గురునిమూలమునసే ♦ గుణముగుదురు
గురునిమూలమునసే ♦ కోరికల్ ఫలియించు
గురునిమూలమునసే ♦ పరముగల్గు
గురునిమూలమునసే ♦ దురితముల్ దొలఁగును
గురునిమూలమునసే ♦ కుతుక మొదవు
గురునిమూలమునసే ♦ దొరఁకొను జ్ఞానమ్ము
గురునిమూలమునసే ♦ విరియు మాయ

గీ. యనుచుఁజెప్పఁగ గురురూప ♦ మవధరించి
వటవిటపినీడ వెలసిన ♦ వామదేవ!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 12

సీ గురుదివ్యరూపంబు ♦ గురుతరభక్తిని
మానసంబున నిల్పి ♦ మనఁగవలయు
గురువరునాజ్ఞను ♦ శిరమునందు ధరించి
ఘనతర ప్రీతిమైఁ ♦ దనరవలయు
గురుజన శుశ్రూష ♦ మరువక నిత్యంబు
పలువిధంబులఁ జల్పి ♦ యలరవలయు
గురుఁ డుపదేశించు ♦ తెఱఁగున గుఱినిల్పి
గురుభక్తిఁ గావించి ♦ పరగవలయు

గీ. ననుచు సద్గురుమూర్తివై ♦ యవతరించి
శిష్యులకుఁ దెల్పి తరియింపఁ ♦ జేయునట్టి
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 13

సీ. దారుకావనితలఁ ♦ దగిలిన మాత్రాన
స్త్రీలోలుఁడని నిన్నుఁ ♦ జెప్పనగునె?
బాణునియింటఁ గా ♦ వలియున్నమాత్రాన
బానిసీఁడని నిన్నుఁ ♦ బలుకనగునె?
పునుక చేకొని బిచ్చ ♦ మున కేగుమాత్రాన
బహుదరిద్రుండంచుఁ ♦ బలుకనగునె?
ప్రేతభూముల సంచ ♦ రించిన మాత్రాన
హార్మ్యముల్ లేవని ♦ యనుటతగునె?

గీ. దేవ! యివియన్నియును భవ ♦ దీయమైన
భూతదయ ప్రకటింపఁగాఁ ♦ బూనుపనులు
బుధజనోల్లాస! ......... ! పార్వతీశ! 14

సీ. పాఁపపేరులతోడఁ ♦ బరగినమాత్రాన
బైసిమాలి వటంచు ♦ పలుకఁ దగునె?
తోలుఁదాలుపవౌచుఁ ♦ దోఁచినమాత్రాన
వస్త్రహీనుఁడవని ♦ వలుకఁదగునె?
నటరాజ బిరుదంబు ♦ ఘటియించుమాత్రాన
నాటగాఁడవటంచు ♦ ననఁగఁదగునె?
జింకను, గోడును ♦ జే ధరించినమాత్రఁ
బిచ్చివాఁడనుచు వా ♦ క్రుచ్చనగునె?

గీ. దేవ ! యివియన్నియును భవ ♦ దీయమైన
నిర్మలప్రేమ వెలిఁజేయు ♦ కర్మములగు
బుధజనోల్లాస !......... ! పార్వతీశ! 15

సీ. అక్షయవిక్రమ! ♦ యానందదాయక!
జయ మన్మథవిరోధి! ♦ సత్స్వరూప!
ఆనందభావ! జ్ఞా ♦ నానందమయదేహా!
సర్వజిత్! శ్రీముఖ! ♦ శాంతరూప!
సౌమ్యా! యీశ్వర! మహా ♦ సౌభాగ్యదాయక
విభవ! మహాతేజ! ♦ విశ్వరూప!
ఖరపరాభవనుత! ♦ కమనీయవిగ్రహా
రావణ వంద్య! వి♦ రాట్స్వరూప!
గీ. ప్లవంగ దేశిక! వృషవాహా! ♦ పరమసుఖద!
యిట్టిడవటంచు నిను నుతి ♦ యింపదరమె!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 16

సీ. పరమేశ! కరుణాస్వ ♦ భావ! మహాదేవ!
దీనజనావన! ♦ దివ్యపురుష!
సాంబ! సదాశివ! ♦ సర్వజ్ఞ! లోకేశ!
పతితపావననామ! ♦ భయవిరామ!
చంద్రశేఖర! భక్త ♦ సన్నుత మృదుపద!
దానవాంతక! మహా ♦ దానకర్త!
ఫాలనేత్ర! మహేశ! ♦ పర్వతసంచార!
నాగభూషణ! మహా ♦ నటవతంస!
గీ. వృషభవాహన! విశ్వేశ! ♦ వృజిననాశ!
విగతభవపాశ! భూతేశ! ♦ గగనకేశ!
బుధజనోల్లాస! దొప్పలపూం ♦ డివాస!
భక్తహృదయేశ! మల్లేశ! పార్వతీశ! 17

సీ. గిరినిలయ! దురితహార! ♦ కరివదనజనక ఖర
కరరుచిరశశినయన! ♦ పరమపురుష!
సురనికరవినుతపద ! ♦ నిరయహార! యచలరథ!
హరి, ధనద ముఖ సఖ! య ♦ విరతసుఖద!
కరకలిత లలితమృగ! ♦ మరణజనన విరహిత!
పురహరణ! వరచరణ! ♦ తురగవృషభ!
వరకుసుమశరదమన! ♦ యురగకరవలయ శివ!
నరవినుత పదయుగళ! ♦ వరద! యభవ!
గీ. గిరిశ! భవహర! శశిధర! ♦ ధరణిభరణ!
కరుణమనుపుము నను భువి ♦ మరువవలదు
బుధజనోల్లాస! ......... ! పార్వతీశ! 18

సీ. మహితస్వరూపాయ! ♦ మధురస్వభావాయ!
మంత్రాత్మకాయ! న ♦ మశ్శివాయ!
మానితాకారాయ! ♦ మామకాభీష్టాయ!
మారహరాయ! న ♦ మశ్శివాయ!
మానిసుతనుతాయ ! ♦ మధుసూదనసఖాయ !
మాయాపహాయ ! న ♦ మశ్శివాయ!
మదదైత్యహరణాయ ! ♦ మాదేవదేవాయ !
మంత్రఫలాయ ! న ♦ మశ్శివాయ !
గీ. మానిజన సేవితాయ ! న ♦ మశ్శివాయ !
మంగళప్రవరాయ ! న ♦ మశ్శివాయ !
యనుచు నినుఁ జింతనముసేయు ♦ నార్యజనము
బుధజనోల్లాస! ......... ! పార్వతీశ! 19

సీ. జయ చరాచరలోక ♦ సన్నుత చారిత్ర!
జయసదాశివ! దాస ♦ జననిధాన !
జయ దేవ! గిరిశరా ♦ సన! దానవవిశోష!
జయ గిరిజాలోల! ♦ శత్రుహరణ !
జయ నాగకేయూర! ♦ సద్యశోవిస్తార!
జయ రాజశేఖర! ♦ సవనదళన !
జయ నాట్యసుందర! ♦ సారసాక్షార్చిత!
జయ హసితానన! ♦ చారునయన!

గీ. జయ గజవినాశ ! శంకర ! ♦ జయగిరీశ !
యనుచు నిన్నుఁ గీర్తించెద ♦ రార్యవరులు
బుధజనోల్లాస! ......... ! పార్వతీశ ! 20

సీ. శ్రీరమాసేవిత! ♦ శ్రీపాదకంజాత!
దామోదర! మహేశ! ♦ దైత్యనాశ!
మునిగణారాధ్య! వి ♦ భూతిదాయక! పాప
నాశ! శంకర! కృపా ♦ ర్ణవ! మహాత్మ!
కృష్ణ పూజిత! శివ ♦ కేశవ సర్వజ్ఞ!
దీనజనావన! ♦ దివ్యపురుష!
గంగాధరా! దివ్య ♦ కామినీ మోహిత!
భూతేశ! సద్గుణ! ♦ భువనపాల!

గీ. దేవ! మృత్యుంజయా! ముదా ♦ త్మ్రిక! పరేశ!
నన్ను బాలింపుమాధవ! ♦ నమ్మితి నిను!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 21

సీ. అభవ ! కల్యాణ చ ♦ య ప్రకాశ కరుణా!
పాథోధి! విశ్వాధి ♦ పా! మహాత్మ!
త్రిభువనారాధ్య! ను ♦ తింతు శంకర! శివా!
భూతేశ! లోకప్ర ♦ భూ! మహేశ!
విభవ! సర్వజ్ఞ! వి ♦ వేకవర్ధన! హరా!
ఫాలాక్ష! దుర్గాధి ♦ పా! గిరీశ!
సుకవివంద్యా! ఖల ♦ శోష! మృత్యువిజయా!
గంగాధరా! దేశి ♦ కా! సతేశ!

గీ. వేదవేదాంతసంవేద్య! ♦ విశ్వనాథ!
ఎంచ నీలీల లెవ్వరి ♦ కేని దరమె!
బుధజనోల్లాస! ……… !పార్వతీశ! 22

సీ. నాన నిన్నెన్న నే ♦ నూనిన నానాని
నేను నిన్నెన్న నా ♦ నెన్ను నన్ను
మనమున నీనామ ♦ మననమ్ము మానను
నీమము నను నేను ♦ నోము నన్ను
నాయనా నియమమ్ము ♦ నను నిన్ను ననయమ్ము
నమ్మిన నాయమా ♦ నన్ను మాన
కమనీయ మునిమాన్య ♦ కానిమ్ము యింక నైనం
గనకున్న నీయాన ♦ కాయమూన

గీ. కరము నినునమ్మి నన్ను నే ♦ మరకుమయ్య
మీరనని నమ్మి మీయాన ♦ మేలుకలన
బుధజనోల్లాస! ……… !పార్వతీశ! 23

సీ. శ్రీకరా ! భక్తర ♦ క్షాకరా ! విధృత ద
గ్వీకరా ! మహాళిధా ♦ రితశశాంక!
శంకరా ! పాపభ ♦ యంకరా ! సత్కృపా
కింకరా ! దైత్యనా ♦ శంకర ! హర !
ఈశ్వరా ! దుర్గాహృ ♦ దీశ్వరా! సర్వభూ
తేశ్వరా ! శాశ్వత ! ♦ విశ్వవినుత !
దేవరా ! ప్రేమతోఁ ♦ బ్రోవరా ! పూజిత
శ్రీవరా ! మహితాను ♦ భావ ! దేవ !

గీ. రాజరాజైకమిత్ర! భూ ♦ రథ! త్రినేత్ర!
నేత్ర భస్మీకృతానంగ ! ♦ నిభృతగంగ !
బుధజనోల్లాస! ......... !పార్వతీశ! 24

సీ. జయజయలోకాత్మ! ♦ జయజయమోక్షాత్మ !
జయజయకరుణాత్మ ! ♦ జయమహాత్మ !
జయజయభూతాత్మ ! ♦ జయజయసాక్ష్యాత్మ !
జయజయసర్వాత్మ! ♦ జయపరాత్మ!
జయజయశాంతాత్మ ! ♦ జయజయసాంఖ్యాత్మ !
జయజయవర్ణాత్మ !♦ జయయజాత్మ !
జయజయభోగాత్మ ! ♦ జయజయయోగాత్మ
జయజయయజ్ఞాత్మ ! ♦ జయఘనాత్మ !

గీ. జయముపరమాత్మ ! తోయాత్మ ! ♦ జయధనాత్మ !
యనుచు నిన్నుఁ గీర్తించెడు ♦ నతఁడె ఘనుఁడు
బుధజనోల్లాస! ......... !పార్వతీశ ! 25

సీ. నిశ్చలభక్తితో ♦ నీమూర్తిజూడగా
వలదొక్కొ కన్నులు ♦ గలుగు ఫలము
నిరతంబుప్రేమతో ♦ నీకథ లాలింప
వలదొక్కొ వీనులు ♦ గలుగు ఫలము
నిర్మలబుద్ధితో ♦ నీపూజ గావింప
వలదొక్కొ కరములు ♦ గలుగు ఫలము
నీ దివ్యనామంబు ♦ నియతితోడ స్మరింప
వలదొక్కొ నాలుక ♦ గలుగు ఫలము

గీ. నిజముగా భక్తియుక్తిచే ♦ నీకుమ్రొక్క
వలవదా యుత్తమాంగము ♦ గలుగు ఫలము
బుధజనోల్లాస! ......... !పార్వతీశ! 26

సీ. అవ్యయానంద! వి ♦ శ్వాత్మ! మహాదేవ!
శైలేశ! దేవతా ♦ సార్వభౌమ!
ఆద్యంతరహిత! మ ♦ హాప్రకాశాన్విత!
నిర్మల! నిశ్చల! ♦ నిర్గుణాత్మ!
ఆనందమయ! వికా ♦ రాదిశూన్య! యనంత!
సర్వమంగళ! సర్వ ♦ శక్తియుక్త!
పరమగురూత్తమ! ♦ పరతత్త్వరూప! మ
హాయోగిసేవిత! ♦ ఆర్యవినుత!

గీ. నాశన విహీన! లోకేశ! ♦ న్యాయవేది!
భావనామాత్రసంతుష్ట ♦ భావ! దేవ!
బుధజనోల్లాస! ......... !పార్వతీశ! 27

సీ. శరణన్న వేల్పులఁ ♦ గరుణఁజూడఁగలేదె
గరళంబు భక్షించి ♦ కడుముదమున
కావుమంచను దశ ♦ గ్రీవునిఁ బ్రోవవే
యదిమిపట్టిన వ్రేలు ♦ ప్రిదులఁజేసి
పాలింపుమన ముని ♦ బాలు మన్పఁగలేదె
యంతకుగర్వంబు ♦ నణఁచిపుచ్చి
కాపాడుమను నొక్క ♦ కాంత నేలఁగలేదె
పతిభిక్షఁబెట్టియు ♦ భవ్యమతిని

గీ. నిరపరాధియు నపరాధి ♦ నేర్పుతోడ
శంకరా! యన్న రక్షించు ♦ సామివీవు
బుధజనోల్లాస! ......... !పార్వతీశ ! 28

వీణమీటుచు నిన్ను ♦ వినుతించి మెప్పింప
ఋషిగా బాణాసు ♦ రుండఁగాను
శతపత్రములచేత ♦ సతతంబు పూజించి
సంతోషపఱపఁ గే ♦ శవుఁడగాను
నీతోడిమైత్రిని ♦ నెరపి హాళినిగూర్ప
మతిమంతుఁడగు యక్ష ♦ పతినిగాను
కైలాసగిరి మీఁద ♦ ఘనతపంబొనరించి
ముదమొనర్పఁగఁ గృష్ణ ♦ మూర్తిగాను

గీ. జడుఁడఁ, గఠినుఁడ, సంచలిం ♦ చెడి మనంబు
వాఁడ, నేగతి నన్నేలు ♦ వాఁడవోయిఁక
బుధజనోల్లాస! ......! పార్వతీశ! 29

సీ. చంద్రశేఖరుఁడవై ♦ జగతి వెల్గితి వీవు
పార్వతీదేవితోఁ ♦ బరఁగి తీవు
వృషభవాహనుఁడవై ♦ వినుతిఁగాంచితి వీవు
నటరాజ మూర్తివైనావు నీవు
కల్యాణసుందర ♦ ఘనమూర్తివయి తీవు
కాలకాలుండవై ♦ గ్రాలితీవు
అంగజ సంహార ♦ మగు మూర్తివయి తీవు
బిక్షాటనముఁజేసి ♦ వెలసితీవు

గీ. యిట్టి నీలీల లెన్నంగ ♦ నేరితరము
బాలుఁడను దోఁచినకొలంది ♦ ప్రస్తుతింతు
బుధజనోల్లాస! ......... ! పార్వతీశ! 30

సీ. త్రిపురాసురుల ద్రుంచి ♦ తేజరిల్లితి వీవు
ధర జలంధరుఁగూల్చి ♦ తనరితీవు
గజదానవుని జంపి ♦ ఘనతఁ గాంచితి వీవు
వీరభద్రుండవై ♦ వెలసితీవు
వ్యాఘ్రాసురుని జంపి ♦ యశముఁగాంచితివీవు
అర్ధనారీశుండ ♦ వయితి వీవు
పురుహూత సుతుఁ బ్రోవ ♦ బోయవైతివి నీవు
కంకాళమూర్తివై ♦ గ్రాలితీవు

గీ. యిట్టి లీలావిశేషంబు ♦ లెంచఁదరమె
బాలకుఁడను యథామతిఁ ♦ బ్రస్తుతింతు
బుధజనోలాస! ......... ! పార్వతీశ ! 31

సీ. చండీశ్వరునిఁ గృపా ♦ సరణిఁ బ్రోచితివీవు
మృత్యుంజయుండవై ♦ మెలఁగితీవు
చక్రప్రదాన రం ♦ జనమూర్తి వయితీవు
విఘ్నేశ్వరునిఁబ్రోచి ♦ వెలసితీవు
పోసఁగ నుమాస్కంద ♦ మూర్తిఁ దాల్చితివీవు
ఏకపాన్మూర్తివై ♦ యొసఁగితీవు
శ్రీసుఖాసీనమూ ♦ ర్తిని ధరించితివీవు
దక్షిణామూర్తివై ♦ దనరితీవు
గీ. ధరణి నురులింగమూర్తి నాఁ ♦ బరఁగితీవు
యిట్టి లీలావిశేషంబు ♦ లెంచఁగలనె
బాలుఁడను దెలియుకొలఁది ♦ బ్రస్తుతింతు
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 32

సీ. రామచంద్రుని మీఁద ♦ రతివల్లభునిమీఁద
బాణునిమీఁద రా ♦ వణునిమీఁదఁ
గపిరాడ్ధ్వజుని మీఁదఁ ♦ గన్నప్పమీఁదను
బ్రహ్మమీఁదను భక్త ♦ రాముమీఁద
గొడగూచి మీఁదను ♦ గోపబాలునిమీఁద
శ్రీదేవిమీ దను ♦ శ్రీదుమీఁద
బంధువర్గముమీఁద ♦ భక్తగణముమీఁద
భార్యాసుతులమీఁదఁ ♦ బ్రకృతిమీఁదఁ
గీ. బరగఁజేసెడి త్వత్కృపా ♦ భరిత దృష్టి
లేశమిటుచొన్పి నన్ను పా ♦ లింపుమయ్య!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 33

సీ. శ్రీమించు కైలాస ♦ శిఖరస్థరత్న హ
ర్మ్యంబునఁ మణిమయ ♦ మంటపమున
సింహాసనమున నా ♦ సీనుండవె మనో
జ్ఞంబగు విమలవే ♦ షంబు దనర
ఘనకుఠారము, మృగి, ♦ జ్ఞానముద్రయునొప్పు
కరములు విజ్ఞాన ♦ సరణిఁదెలుప
ముడిచిన డాపలి ♦ తొడమీఁద శైలకు
మారిక తీవిమైఁ ♦ గూరుచుండ
నడుముదట్టి బిగించి ♦ నందీశ్వరుఁడు కుడి
పాదంబు దోసిటఁ ♦ బట్టియుండ
చండీశ, విఘ్నేశ, ♦ షణ్ముఖ, వీరభ
ద్ర, మహామునీశ్వరుల్ ♦ ప్రస్తుతింప

గీ. గంగశిరముననుండియుఁ ♦ దొంగిచూడ
లేత నెల మౌళితలమున ♦ లీలఁగ్రాల
నగయగుచు మొగమున జిరు ♦ నగవుదోఁప
కరుణఁ దొలఁకాడు చూడ్కుల ♦ మెరయుచుండు
బుధజనోల్లాస ! దొప్పల ♦ పూఁడివాస!
భక్తహృదయేశ! మల్లేశ! ♦ పార్వతీశ! 34

సీ. శ్రీమీఱఁగ విపంచిఁ ♦ జేఁబూని భారతి
చంచద్గతిఁ బలి ♦ కించుచుండ,
వెలయ శచీజాని ♦ వేణువు గైకొని
యుత్సాహ మిగురొత్త ♦ నూదుచుండ,
డంబుమీఱఁగ విక ♦ చాంబుజోదరుపట్టి
వడి తాళములఁబట్టి ♦ వైచుచుండ,
సంతోష ముప్పొంగ ♦ జలధికన్య వినూత్న
ఫక్కిని గీతముల్ ♦ పాడుచుండ,
కనకాంబరుఁడు మృదం ♦ గముఁ జెంత నిడుకొని
యింపెనయంగ వా ♦ యించుచుండ,

గీ. సకల సురమౌని గణములు ♦ సందడింప,
ప్రమథగణములు సేవింపఁ ♦ బ్రతిదినంబు
నార్యకుఁ బ్రమోదముం గూర్ప ♦ నల ప్రదోష
సమయమునఁ జిత్రసరణి లా ♦ స్యము నొనర్చు
బుధజనోల్లాస! దొప్పల ♦ పూఁడి వాస!
భక్తహృదయేశ! మల్లేశ! ♦ పార్వతీశ! 35

సీ. రుద్రాక్షదాల్చిన ♦ రుజలుతొలంగును
రుద్రాక్ష దాల్చిన ♦ భద్రమమరు
రుద్రాక్షదాల్ప ద ♦ రిద్రతా హీనుడౌ
రుద్రాక్షదాల్చిన ♦ రుద్రుడవును
రుద్రాక్ష దాల్చిన ♦ రోషాదులు శమించు
రుద్రాక్షదాల్చిన ♦ రూపమొదవు
రుద్రాక్షదాల్ప ను ♦ పద్రవంబులు వాయు
రుద్రాక్షదాల్చిన ♦ రూఢిగాంచు

గీ. ననెడి నమ్మికచే నరు ♦ లఱుతదాల్ప
నీకృపా పాత్రులై సుఖ ♦ నియతినుంద్రు
బుధజనోల్లాస! ......... ! పార్వతీశ! 36

సీ. హరహరా! యనుచు ని ♦ న్నరిది బిల్చినమాత్ర
ఘోరాఘములనెల్ల ♦ గూల్తువనియు
శంకరా! యని నిన్ను ♦ సంస్మరించినమాత్ర
గోరికలెల్ల జే ♦ కూర్తువనియు
ఈశ్వరా: యని నిన్ను ♦ నెంతయు: గీర్తింప
నిర్మలజ్ఞాన మిా ♦ నేర్తువనియు
ఫాలనేత్రా! యని ♦ పలుకరించినమాత్ర
భవబాధములనెల్ల ♦ బాపుదనియు

గీ. పెద్దలందఱు వచియింప ♦ బ్రేమతోడ
నిన్నె మనమున నిల్పితి ♦ నన్నుబ్రోవు
బుధజనోల్లాస! ......... ! పార్వతీశ! 37

సీ. సుజ్ఞానము నొసంగు ♦ సులభుండవని నిన్ను
సుజ్ఞానియైన యా ♦ శుకుఁడెఱుఁగు
వంద్యులకెల్లను ♦ వంద్యుండవీవని
మహితంబులౌ నిగ ♦ మంబులెఱుఁగు
ఆద్యంతరహితుఁడ ♦ వన హంస, కిటిరూప
ధరులు, వాణీ, రమా ♦ ధవులకెఱుక
నిత్యుండవని నిన్ను ♦ నెమ్మది నూహింప
బ్రహ్మకపాలముల్ ♦ బరఁగనెఱుఁగు
గీ. ధ్యేయరూపుడవని నిన్నుఁ ♦ దెల్పుటకును
మునివరులెరుంగుదురు నాకుఁ ♦ గనఁగఁదరమె
బుధజనోల్లాస! ........! పార్వతీశ! 38

సీ. నీభస్మమేగదా! ♦ నిఖిలపాపంబుల
సంహారమొనరింపఁ ♦ జాలినయది
నీవిభూతియెగదా! ♦ నిఖిలసంకటముల
దరిఁ జేరరాకుండఁ ♦ దరుమఁగలది
నీక్షారమేగదా! ♦ నిఖిలసౌఖ్యంబులు
కొల్లలుగా నొడఁ ♦ గూర్పఁగలది
నీరక్షయేగదా! ♦ నిర్మలతేజంబు
గలిగింప మిన్నయై ♦ వెలిఁగెడునది
గీ. అట్టి నీభూతిఁ జేఁపట్టి ♦ యఖిలజనులు
మోక్షసామ్రాజ్య వైభవ ♦ మున సుఖింత్రు
బుధజనోల్లాస! ........! పార్వతీశ! 39

సీ. కనకశైలము నీదు ♦ కార్ముకంబైయుండ
నేమియర్పింతు నీ ♦ కెంచిచూడ
నిఖిలనాయకుఁడు నీ ♦ నేస్త్రకాఁడైయుండ
నేమి యర్పింతు నీ ♦ కెంచిచూడ
రజతాద్రి క్రీడాభి ♦ రామమై విలసిల్ల
నేమియర్పింతు నీ ♦ కెంచిచూడ
శుభములు నీయంఘ్రిఁ ♦ జుట్టినవైయుండ
నేమియర్పింతు నీ ♦ కెంచిచూడ
గీ. కానఁబడియెడిఁ జిత్తము ♦ కండు దాని
భక్తినర్పింతు నీకుఁ జే ♦ పట్టుమయ్య!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 40

సీ. యజ్ఞాది దివ్యకా ♦ ర్యములఁ జేయఁగఁజాల
భజియింతు నీపాద ♦ పంకజముల
అష్టాంగయోగము ♦ లభ్యసింపఁగఁజాల
నీనామభజనంబు ♦ నెరపఁదలఁతు
వేదాంతతత్త్వ వి ♦ వేకంబుఁ గనఁజాల
సేవించెదను భక్తి ♦ చేత నిన్ను
నిశ్చలస్థితి మది ♦ నిలుపంగఁజాలను
కీర్తించెదను నిన్నుఁ ♦ గేలుమోడ్చి
గీ. ఇంతియేగాని యెఱుఁగ నే ♦ నెట్టిత్రోవ
నేగతిని నన్నుఁ జేపట్ట ♦ నెంచినావొ!
భారమంతయు నీదియే ♦ భక్తపాల!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 41

సీ. ఎన్నిజన్మములలో ♦ నెక్కడెక్కడనేమి
యేమి సేసితినో నా ♦ కెఱుఁగనగునె?
ఎందుల కీజన్మ ♦ మెత్తించితో మీఁద
నేమిసేయించెదో ♦ యెఱుఁగనగునె?
ఏలపుట్టింతువో ♦ ఏలపోషింతువో
ఏలహరింతువో ♦ యెఱుఁగనగునె?
ఏమయ్యెనో మున్ను ♦ నేమగునో ముందు
యేమగుచున్నదో ♦ యెఱుఁగనగునె?
గీ. ఎందుకో యిట్లు చేయఁగా ♦ నెంచినావొ?
యెఱుఁగఁగాఁజాల నీలీల ♦ లెవ్వరికిని
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 42

సీ. ఆదిమధ్యాంత శూ ♦ న్యత నొప్పు నీరూప
మిట్టిదటంచన ♦ నెట్లునేర్తు
అండపిండాండ బ్ర ♦ హ్మాండమూ నీయున్కి
కిది దారియని చెప్ప ♦ నెట్లునేర్తు
శ్రీమదనంత వి ♦ శేషనాముఁడవు నీ
కీనామమని పల్క ♦ నెట్లునేర్తు
అగణితంబగుశక్తి ♦ నలరారుచుండు నీ
వీపాటివని చెప్ప ♦ నెట్లునేర్తు
గీ. కాని మీరలు పల్కించు ♦ కరణిఁబల్క
నేర్చితిని నాదు కర్తృత్వ ♦ నియతిలేదు
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 43

సీ. హంస పద్మవనంబు ♦ నాసించు మాదిరి,
కోకంబు సూర్యునిఁ ♦ గోరుకరణిఁ,
జాతకంబు వినీల ♦ జలదంబు వాంఛించు
భంగిఁ, జకోరంబు ♦ ప్రతిదినంబు
చంద్రునిఁగనుఁగొని ♦ సంతసించెడి రీతి,
నెనలేక నాచిత్త ♦ మనవరతము
చిన్మార్గమ్ముగ్యమై ♦ చెలఁగి మహానంద
భాగ్యంబు బ్రహ్మైక్య ♦ భావమెలమి

గీ. నొసఁగు భవదీయ పాదసా ♦ రసయుగళము
గోరుచున్నది యటులొనఁ ♦ గూర్పుమయ్య!
బుధజనోల్లాస! ......... పార్వతీశ! 44

సీ. అడవిని జిడిముడి ♦ పడువాఁడు మార్గంబు,
తపియించు పాంథుండు ♦ తరువునీడ,
నాఁకలిగొనినట్టి ♦ యతిథిగృహస్థుని,
నిరుపేదధార్మిక ♦ నృపవరేణ్యు,
చీఁకటఁగానక ♦ చిక్కువాఁడు వెలుంగుఁ,
జలిబాధనొందెడు ♦ జనుఁడు శిఖిని,
నామయ పీడితుం ♦ డాఢ్యుఁడౌ వైద్యుని,
ననపత్యుఁడు గుణాఢ్యుఁ ♦ డగు కుమారు,

గీ. నభిలషించెడు గతి భవ ♦ దంఘ్రియుగము
నాశ్రయించితి నన్నేలు ♦ మయ్య! ప్రేమ,
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 45

సీ. భవరోగములనెల్లఁ ♦ బాపఁజాలెడి మహో
దివ్యౌషధము భవ ♦ దీయసేవ,
అజ్ఞానమనెడి మ ♦ హాంధకారమడంప
దివ్యాంజనము భవ ♦ దీయసేవ,
భవభయభూధర ♦ పటలమ్ము నగలింప
దివ్యాయుధము భవ ♦ దీయసేవ,
అభిమతంబుల నిచ్చి ♦ యానందమొనఁగూర్ప
దివ్యధేనువు భవ ♦ దీయసేవ,
గీ. భ్రాంతులన్నిఁటిఁ దొలఁగించి ♦ భవ్యతరము
దివ్యపదలాభమిడు భవ ♦ దీయసేవ,
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 46
సీ. జంగమరూపంబు ♦ సంతరించి నటించు
వేల్పు నాదొక చిన్ని ♦ విన్నపంబు
సంస్కృతియనుకాన ♦ సంచరించెడునది
స్త్రీకుచగిరులందుఁ ♦ దిరుగెడునది
పెండ్లము బిడ్డలన్ ♦ ప్రేమశాఖలనెక్కి
పగలురాత్రులు వేడ్క ♦ నెగిరెడునది
సకలదిక్కులయందు ♦ సంచరించెడునది
బహుతర చపలస్వ ♦ భావమునను
గీ. గొక్కరించు నా మనమను ♦ కోఁతిగలదు
చిక్కులను బెట్టి నన్నుగా ♦ సించుచుండు
దానిదృఢభక్తియను పెను ♦ త్రాటఁగట్టి
భవ దధీనమ్ముగావింపు ♦ భవవినాశ!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 47

సీ. భూతేశ్వరా! నిన్నుఁ ♦ బూజించుకతమున
సారూప్యమనెడి మో ♦ క్షంబుగలుగు
సర్వేశ్వరా! నిన్ను ♦ సంకీర్తనముచేయ
సామీప్యమనెడి మో ♦ క్షంబుగలుగు
పరమేశ్వరా! నీవు ♦ భక్తులం జేరిన
సాలోక్యమనెడి మో ♦ క్షంబుగలుగు
విశ్వేశ్వరా! నిన్ను ♦ వీక్షింప లోలోన
సాయుజ్యమనెడి మో ♦ క్షంబుగలుగు
గీ. ననుచుఁ జెప్పిరి విబుధులై ♦ యలరు వార
లెట్లు చేపట్టనెంచితో ♦ యింకనన్ను
సేవకుని, దాసదాసుని, ♦ జిన్నవాని,
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 48

సీ. బ్రహ్మచారియొగాని ♦ భవనభర్తయొగాని
అంబజటిగాని స ♦ న్న్యాసిగాని
భూమీసురుఁడుగాని ♦ పౌరబాహుజుఁడుగాని
బేరిగాని రయితు ♦ పెద్దగాని
అర్థవంతుఁడుగాని ♦ నిర్ధనికుఁడుగాని
గుణిగాని మఱియు ని ♦ ర్గుణుఁడుగాని
కుంటివాఁడేకాని ♦ గ్రుడ్డివాఁడేగాని
తుదకెవ్వఁడేఁగాని ♦ సదమలమతి
గీ. నిన్ను సేవింప సుఖదుఃఖ ♦ నివహ ముడిపి
అతులసుఖమునుగూర్తు మ ♦ హానుభావ!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 49

సీ. సంసృతియనియెడి ♦ జలదంబు సడలునే
శర్వసేవా ప్ర ♦ భంజనము లేక,
అరివర్గమనెడు దా ♦ వాగ్ని చల్లారునే
మృడ కీర్తనామృత ♦ వృష్టి లేక,
కలుషంబులను మహా ♦ జలరాసులింకునే
హరధిషణా బడ ♦ బాగ్ని లేక,
విపదంధకారంబు ♦ విచ్చిపోఁజాలునే
పశుపతినతి రవి ♦ ప్రభలు లేక,

గీ. ననుచు నమ్మి నిన్ గొల్వ భ ♦ వాబ్ధిగడచి
జ్ఞానమును నాత్మరూపము ♦ గాంచనగును,
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 50

సీ. బలిదైత్యుఁ డెద్దాని ♦ బలిమి కల్మిని రసా
తలమున దాగఁ గా ♦ వలసె మున్ను,
ఎద్దాని మహిమచే ♦ నద్దమయంతియు
నలుఁడును గానల ♦ నవసినారొ,
తలలొక్క పదిగల్గు ♦ దానవుఁ డెద్దానఁ
గులమువారలతోడఁ ♦ గలనఁగూలె,
యిల ధర్మరాజాదు ♦ లెద్దానిచే వన
ములఁ బలుసిలుఁగుల ♦ నలసినార,

గీ. లట్టి కర్మపిశాచంబు ♦ మట్టుపెట్టి
సుఖముగ లైడు మార్గంబు ♦ చూపుమయ్య!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 51

సీ. ప్రహ్లాదుఁ డేపాటి? ♦ వయసున దేనికి
బద్ధుఁడై యానంద ♦ పదవిఁగనియె,
వర ధ్రువుఁ డేపాటి? ♦ వయసున దేనికి
వశుఁడయి తులలేని ♦ పదవిఁగనియె,
సానందు డెంత? యే ♦ సరణికి లోఁబడి
పాపులకైవల్య ♦ పదవికనిపె,
ఉపమన్యు వేపాటి ? ♦ యూహింప యేనియ
తినిజేసి తనకోర్కి ♦ తీర్చికొనియె,
గీ. భక్తిభావంబు మనమునఁ ♦ బ్రబలుకతన
వీరలెల్లరుఁ బూజ్యులై ♦ వెలసిరహహా!
భక్తియెడ బిన్నపెద్దయన్ ♦ భావమున్నె?
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 52

సీ. జనకుఁ డెద్దానిచే ♦ సంసారముననుండి
పరమసుఖంబును ♦ బడయఁగల్గె,
శ్రీశుకుం డెద్దానిఁ ♦ జేపట్టి సంసృతి
సడలించియొకట మో ♦ క్షంబునందె,
హనుమంతుఁ డెద్దాని ♦ నాశ్రయించినమాత్ర
బంధముక్తియు బ్రహ్మ ♦ భావమొనసె,
పరమమునులు దేని ♦ వలన నిత్యానంద
మగుస్వరూపంబున ♦ నలరఁజాలి,
గీ. రట్టినిర్మల విజ్ఞాన ♦ మెట్టులైనఁ
గలుగుపద్ధతి ఘటియించి ♦ కావుమయ్య!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 53

సీ. పదునొకండిటి నైనఁ ♦ బదిలంబుగాఁ బట్ట
లేనైతి జ్ఞానమే ♦ లీలఁగలుగు
ఆఱింటినైనను ♦ నరికట్టఁ గానోప
లేతినైజ్ఞానమే ♦ లీలఁగలుగు
నాల్గింటినైన వి ♦ న్నాణంబుఁగా జేయ
లేనైతి జ్ఞాన మే ♦ లీలఁగలుగు
కడకు మూఁడిటినైనఁ ♦ గడకుఁ బోద్రోయంగ
లేనైతి జ్ఞాన మే ♦ లీలఁగలుగు
గీ. తుదకు నొకటైన నిల్పగాఁ ♦ దోఁపదయ్యె
నేవిధంబున సుజ్ఞాన ♦ మిత్తువొకద
భూరికరుణాలవాల! శం ♦ భో! మహాత్మ!
బుధజనోల్లాస! ........! పార్వతీశ! 54

సీ. భార్యాకుమారులు ♦ భ్రాతలు బంధువుల్
ఋణబంధజాతులు ♦ గణుతిసేయ
తోఁటలు భవనముల్ ♦ దొడ్లు కేదారముల్
తలఁప ఋణానుబం ♦ ధమునఁగలు
ధనములు నగలును ♦ ధాన్యముల్ చెలుములు
ధరణి ఋణానుబం ♦ ధమునఁగల్గు
పశువులు మొదలగు ♦ పలుజంతువుల పొత్తు
తలఁప ఋణానుబం ♦ ధమునఁగల్గు
గీ. ననుచుఁ దెలిసియు మానవు ♦ లమితమైన
మోహసాగరమునఁ బడి ♦ మునుఁగుచుంద్రు
బుధజనోల్లాస! ........! పార్వతీశ! 55

సీ. ఇతఁడు బ్రాహ్మణుఁడంచు ♦ నితఁడు శూద్రుఁడఁటంచు
బ్రహ్మదేవుండైనఁ ♦ బలుకలేఁడు
ఇదికులాంగన యంచు ♦ నిది ధనాంగనయంచు
శ్రీసరస్వతులైనఁ ♦ జెప్పలేరు
ఇతఁడు హైందవుఁడంచు ♦ నితఁడు హూణుఁడటంచు
పన్నగరాజైనఁ ♦ బలుకలేఁడు
ఇతఁడు శిష్టుఁడఁటంచు ♦ నితఁడు దుష్టుఁడఁటంచు
సురనాయకుండైన ♦ చూడలేఁడు
గీ. అహహా! యీమాదిరిని కాల ♦ మతివిచిత్ర
రీతిగా మారె వీరికే ♦ రీతిగల్గు
తావకీనపదాంబుజ ♦ ధ్యానవాంఛ
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 56

సీ. వచ్చినసమయానఁ ♦ దెచ్చితిమే డబ్బు
పోవునప్పుడు కొంచుఁ ♦ బోవననుచు
మనకండ్లముందర ♦ మాయమైరెందరో
మనము మాత్రము స్థిర ♦ మాయటంచు
ఇదిచేయఁగాఁ దగ ♦ దిది చేయవచ్చునన్
ఘనవివేకము మాకుఁ ♦ గలదటంచు
ఇండ్లు, ధనము, బంధు ♦ లెవరు తోడైరారు
పాప పుణ్యంబులే ♦ వచ్చుననుచు
గీ. తెలిసియుండియు మనుజులు ♦ త్రిమ్మరుదురు
కానిమార్గము లందహం ♦ కారముునను
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 57

సీ. చక్కందనముఁ గల్గు ♦ చానలఁ జూచుచు
పోకుగావర్తించు ♦ చుండువారె,
పేకాటలన్నను ♦ ప్రేమంబువహియించి
కాలమెల్లను వృథా ♦ గడపువారె,
పరధనం బేరీతిఁ ♦ బ్రాప్తించునాయను,
నాలోచనమ్ముతో ♦ నలరువారె
ఉబుసుపోకకుమాట ♦ లొనరఁజెప్పెడివారిఁ
జేరికాలముఁ బుచ్చి ♦ చెలఁగువారె,
గీ. కానిభవదీయ పూజాది ♦ ధ్యానకలనఁ
గాలముంబుచ్చు సుకృతులు ♦ గానరారు
బుధజనోల్లాస! ......... ! పార్వతీశ! 58

సీ. తనకున్నయంతలో ♦ దానమిచ్చెడువాఁడు
తనవలెఁ బరులను ♦ గనెడివాఁడు
జీవహింసనొనర్ప ♦ నేవగించెడువాఁడు
పరులసొమ్మునకాస ♦ పడనివాఁడు
పెద్దలఁ గనుగొన్నఁ ♦ దద్దమ్రొక్కెడువాఁడు
అనృతంబులాడని ♦ యట్టివాఁడు
దుష్టులసంగతిఁ ♦ దొలఁగి మెలంగువాఁ
డాస్తికబుద్ధిచే ♦ నలరువాఁడు
గీ. నీదుకరుణకుఁ బాత్రులై ♦ నెగడఁగలరు
తాము తరియించుమార్గానఁ ♦ దథ్యముగను
బుధజనోల్లాస! ......... ! పార్వతీశ! 59

సీ. ఎన్నిజన్మంబుల ♦ నెత్తించినాఁడవో
యేజన్మముందీయ ♦ నెంచినావో
ఏపుణ్యపాపంబు ♦ లెంతచేయించితో
యేమిచేయింపఁగా ♦ నెంచినావో
ఏకష్టసుఖముల ♦ నెన్నికల్పించితో
ఏయవికల్పింప ♦ నెంచినావో
ఏవిధంబుననన్ను ♦ నీక్షించినాఁడవో
యేమాదిరిని జూడ ♦ నెంచినావో
గీ. యేమిజరుగునో యేమౌనో ♦ యేమిగలదో
యేమిచేయంగఁ దలఁచితో ♦ యింకనన్ను
దాసజనలోల! భక్తసం ♦ త్రాణశీల!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 60

సీ. బోయవాఁడని యెంచఁ ♦ బోక నవ్వానిచేఁ
బూజలఁగొనినట్టి ♦ పూజ్యచరిత!
పుక్కిటినీటినే ♦ భూరి తీర్థంబని
స్నానమొనర్చిన ♦ సగుణరూప!
చెప్పులపాదాల ♦ చే నిన్నుఁ దుడిచినఁ
జే, యనిముదమందు ♦ జింకతాల్ప!
ఎంగిలిసేసిన ♦ యెరని వేదించిన
పరమాన్నమని తృప్తి ♦ పడినవేల్ప!
గీ. భక్తులేరీతిఁ జేసిన ♦ భావమందు
సంతసించియు ముక్తి నో ♦ సంగుదేవ!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 61

సీ. బ్రహ్మవాదులు దేని ♦ బ్రహ్మమఁటందురో,
శూన్యవాదులు దేని ♦ శూన్యమండ్రో,
పౌనరసాంఖ్యులు దేనిఁ ♦ బురుషుఁడఁటందురో,
వరయోగులెద్ది యీ ♦ శ్వరుఁడఁటండ్రో,
శైవులు దేనిని ♦ శంకరుండందురో,
విజ్ఞులుదేని సం ♦ విత్తఁటండ్రో,
కాలవాదులు దేని ♦ కాలమఁటందురో,
కర్మిష్ఠులెద్దానిఁ ♦ గర్మమండ్రో,
విష్ణుభక్తులుదేని ♦ విష్ణువఁటందురో,
శాక్తేయులెద్దాని ♦ శక్తియండ్రో,
సౌరులుదేనిని ♦ సూరుఁడఁటందురో,
యచలవాదులు దేని ♦ నచలమండ్రో,
అల యవనులు దేని ♦ నల్లాయఁటందురో,
క్రైస్తవులెవ్వని ♦ క్రీస్తనందురో,

గీ. సర్వశాస్త్ర సిద్ధాంతమా ♦ నుర్వినెద్ది?
నిండి నిబిడీకృతంబయి ♦ యుండునెద్ది?
అట్టి మీ సుస్వరూపంబు ♦ నభినుతింతు.
బుధజనోల్లాస! దొప్పల ♦ పూఁడివాస!
భక్తహృదయేశ! మల్లేశ! ♦ పార్వతీశ! 62

సీ. దండంబు శైలకో ♦ దండ! భండనభీమ!
చండశాసన! మహో ♦ ద్దండ తేజ!
నందనంబు మునీంద్ర ♦ వందితపాదార
విందా! సుందర! నంద ♦ నందన సఖ!
జోహారు ఘోరవి ♦ షాహార! వృషవాహ!
నీహారయశ! భూతి ♦ దేహ! లసిత!
జోత పూతచరిత్ర! ♦ పాతకసంహార!
వాతాశన విభూష! ♦ భూతరాజ!
గీ. మ్రొక్కులొనరింతు ముక్కంటి! ♦ చక్కనిదొర!
తరచు సాష్టాంగమొనరింతు ♦ నరయుమయ్య!
బుధజనోల్లాస! దొప్పల ♦ పూఁడివాస!
భక్తహృదయేశ! మల్లేశ! ♦ పార్వతీశ! 63

సీ. ధ్యానంబు గురురూప ♦ ధారియౌ శివునకు,
నావాహనము పర ♦ మాత్మునకును,
నవరత్నసింహాస ♦ నము దివ్యమూర్తికి,
నర్ఘ్యంబు సర్వలో ♦ కార్చితునకు,
పాద్యం బఖిలజీవ ♦ పాలన నేతకు,
నాచమనంబు మ ♦ హాత్మునకును,
అభిషేకములు పర ♦ మానందదాయికి,
వస్త్రయుగ్మముదేవ ♦ వంద్యునకును,
గీ. యజ్ఞసూత్రము, గంధపు ♦ ష్పాక్షతలును,
ధూప, దీప, నివేదనా ♦ దులు భవునకు
ననుచు నీపూజలను జేయు ♦ నతఁడె ఘనుఁడు
బుధజనోల్లాస! ... ... ...! పార్వతీశ! 64

సీ. వనమృగంబులు సింహ ♦ మునకుఁ జిక్కెడుభంగి
నీచేతఁ జిక్కెను ♦ నెమ్మి మృగము
మదపు టేనుఁగును నే ♦ మాద్రిఁ గేసరిచంపు
నట్లె గజాసురు ♦ నదిమితీవు
శార్దూలమును హరి ♦ చక్కాడు విధమున
వ్యాఘ్రాసురుని జంపి ♦ యలరినావు
మృగపతిఁ గనుఁగొన్న ♦ మృగమండలమడంగు
నీయందలయమందు ♦ నీయఖిలము
గీ. గిరులమీఁదను సింహంబు ♦ నెఱివసించు
రజతగిరి నీనివాసము ♦ రాణకెక్కఁ
గాన పంచాస్యతుల్యమై ♦ క్రాలుమీరు
నామనోగుహనుండ నా ♦ కేమిభయము?
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 65

సీ. భవబంధములఁ బాపి ♦ భవ్యరూపులఁ జేయ
పాటలు పరమేశు ♦ భజనలరయ,
కామాదులఁ ద్రుంచి ♦ కైవల్యమిప్పింప
త్రోవలు భూతేశు ♦ సేవలరయ,
మూఢత్వముఁ బాపి ♦ ముక్తికాంతనుజూప
సుగమముల్ శ్రీకంఠు ♦ చూపులరయ,
గదలెల్లవిదళించి ♦ ముదముగూర్పఁగ రాట్న
ధమ్ములు, శూలిగీ ♦ తమ్ములరయ,
గీ. ననుచు ననిశంబుఁ బల్కెడు ♦ నార్యజనము
గాన నినుఁగొల్చిధన్యతఁ ♦ గాంచువాఁడ
బుధజనోల్లాస! .........! పార్వతీశ!

సీ. రథ, గజ, తురగాది ♦ రమ్యవాహనములు
వేడ్క భక్తులకిడు ♦ "వృషభవాహ!"
చందన గంధాది ♦ సారసుగంధముల్
భక్తులకొసంగెడి ♦ "భస్మదేహ!"
చీనిచీనాంబర ♦ శ్రేణినాశ్రితతతి
నలరించు "వ్యాఘ్రచ ♦ ర్మాభిరామ!"
చతురంగ వరచమూ ♦ సముదాయముల్ భక్త
జనులకుఁ గూర్చు "పి ♦ శాచనాథ!"
గీ. గరళకంఠ! దిగంబర! ♦ కామదహన!
సర్వమునకీవె కర్తవై ♦ జగతిలేని
వానిపోలికఁ గన్పడు ♦ వాఁడ [illegible] !
యిట్టి నీలీలలను నుతి ♦ యింపఁదరమె!
బుధజనోల్లాస! ... ... ...! పార్వతీశ! 67

సీ. ఆహారమును దిను ♦ నప్పుడైననుగాని,
యప్పుల గ్రోలెడు ♦ నపుడుగాని,
నిద్రవోయెడివేళ ♦ నేఁగాని, మాటాడు
తఱిగాని, చదివెడి ♦ జాడఁగాని,
శ్రమపడుచోఁగాని, ♦ సంతసించెడువేళఁ
గాని, వినెడు నెడ ♦ నైనఁగాని,
గమనవేళనుగాని, ♦ కనలినప్పుడుఁగాని,
వినయ భయాదృతి ♦ వేళఁగాని,
గీ. మీస్వరూపంబుఁజూచుచు, ♦ మీభజనము
జేయువానిఁగ ననుఁజేయు, ♦ జీవితేశ!
బుధజనోల్లాస! ... ... ...! పార్వతీశ! 68

సీ. త్రిపురాసురుల సంహ ♦ రించు కాలంబున
శరమయి సాయమ్ము ♦ సలిపె నీకు,
వేడ్కతోడఁ బ్రపంచ ♦ విహారణాస్ఫురణచే
వృషభమై నిన్ను సే ♦ వించె భక్తి,
ఆర్యాత్వమునుబూని ♦ యర్ధదేహమునందు
భార్యయై తోడ్పడఁ ♦ బరఁగె నీకు,
త్వత్పాదపద్మముల్ ♦ దర్శింప భక్తితో
సేవించెఁ గ్రోడమై ♦ చిత్తమలర,
త్రిభువనమోహినీ ♦ దేవతనా నొప్పి
సఖియయి నిన్ను నా ♦ శ్చర్యపెట్టె,
తాండవంబొనరించు ♦ తఱిని మృదంగము
వాయించి సంతోష ♦ పఱచె నిన్ను,
పూజించు తఱి నొక్క ♦ పుష్పము తక్కువగనఁ
గనుదమ్మి నర్పించి ♦ ఘనతఁ గాంచె,

గీ. మీశరీరభాగంబునై ♦ మెలఁగు విష్ణు
విటులఁ ద్వదనుగ్రహముఁగన ♦ నెంతవాఁడొ?
పూజ్యులగువారి లోపలఁ ♦ బూజ్యుఁడయ్యె
గాన మీకృప గల్గిన ♦ ఘనుఁడె ఘనుఁడు.
బుధజనోల్లాస! దొప్పల ♦ పూఁడి వాస!
భక్తహృదయేశ! మల్లేశ! పార్వతీశ! 69

సీ. కాలుండుపాశానఁ ♦ గట్టవచ్చినవేళ
తలఁతునో తలఁపనో ♦ తలఁతునిపుడె,
కఫ, వాత, పైత్యముల్ ♦ గ్రమ్మినసమయాన
తలఁతునో తలఁపనో ♦ తలఁతునిపుడె,
చుట్టముల్ చుట్టునుఁ ♦ జుట్టియుండెడితఱి
తలఁతునో తలఁపనో ♦ తలఁతునిపుడె,
మూఁడింటిచేవ తా ♦ మొదలంటఁ బోయిన
తలఁతునో తలఁపనో ♦ తలఁతునిపుడె,

గీ. భవ్యభవదీయనామంబు ♦ పరమభక్తి
చాలసుజ్ఞానమిచ్చి న ♦ న్నేలుకొఱకు
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 70

సీ. కులవధూటినివీడి ♦ కులటఁ జేరినభంగి
పాలుమాని విషంబు ♦ గ్రోలుకరణి,
సజ్జను వీడి దు ♦ ర్జనునిగూడు వితాన
మల్లెను విడి యుల్లి ♦ మలయుపోల్కి,
మాణిక్యమును వీడి ♦ మసిబొగ్గుగొను తేవ
కనకంబు విడి కంచుఁ ♦ గొనినమాద్రి,
ఇలువీడి వనమున ♦ కేఁగిన విధమున
దాతను విడి లోభి ♦ దరియుజాడ,

గీ. యగును నినువీడి యితరుల ♦ నాశ్రయింప
భక్తజనమందిరాంగణ ♦ పారిజాత!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 71

సీ. గిరిమీఁద వేడ్కతోఁ ♦ దిరుగుచునుంటివో!
కూర్మితో సతులను ♦ గూడినావొ!
సమదరాక్షసులను ♦ జక్కాడఁబోతివో!
దాసులఁ బాలింపఁ ♦ దరలినావొ!
మునిజనచిత్తాబ్జ ♦ ముల వెల్గుచుంటివో!
యనుఁగులఁ గూడఁగా ♦ నరిగినావొ!
భక్తులయింటిలో ♦ పలఁ గూరుచుంటివో!
యిఁక మఱెక్కడికైన ♦ నేగినావొ!
గీ. ఆలకించితివో! లేక ♦ యాలకించ
కుంటివో! యెట్టులైన నీ ♦ వెంటఁబడితి
రమ్ము ప్రోవఁగ కరుణార ♦ సమ్ముఁ జిమ్మ
బుధజనోల్లాస! ......... ! పార్వతీశ! 72

సీ. పైడిపాత్రల వెండి ♦ పాత్రల నేమేని
అడుగుదునని భయ ♦ పడఁగ వలదు
చక్రంబుగాని య ♦ స్త్రంబు లేమేఁగాని
కోరుదునని మదిఁ ♦ గొదుకవలదు
చెయివెట్ట సన్ని భ ♦ స్మీభూతమగునట్లు
యాచింతునని సంశ ♦ యంబువలదు
వాఁకిటనుండెడి ♦ వాఁడ వగుమటంచు
ప్రార్థింతునని భయ ♦ పడఁగ వలదు
గీ. గాని మీసేవకుఁడనయి ♦ క్రాలుచుండఁ
గోరుదును నంతెచాలు నా ♦ కు మఱియేల?
బుధజనోల్లాస! ... ...! పార్వతీశ! 73

సీ. ఆలించితివిగదా! ♦ యార్తరావంబులు
ఏమో యటంచు ను ♦ నెంచబోక,
గాలించితివిగదా! ♦ కర్బురాధిపులను
అదనిదిగాదు కా ♦ దనఁగఁబోక,
పాలించితివిగదా! ♦ భక్తుల నెల్లర
కానిమ్మటంచును ♦ గడపఁబోక,
తూలించితివిగదా! ♦ దుష్పథగాముల
నప్పుడిప్పుడటంచుఁ ♦ జెప్పబోక,
గీ. ఇటుల నలరారు మీరు న ♦ న్నీవిధమునఁ
బ్రోవగానాలసించినఁ ♦ బోవుయశము
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 74

సీ. సాగునే! నీదగు ♦ సాయమించుక లేక
విద్యావిశేషంబు ♦ వెరవుతోడ,
వచ్చునే! నీదు ది ♦ వ్యప్రసాదము లేక
సంపదలెల్లను ♦ బెంపుతోడ,
కల్గునే! నీదు క్రీఁ ♦ గంటికి గుఱిగాక
కకుబంత విశ్రాంత ♦ ఘనయశంబు,
పొదలునే! త్వత్పాద ♦ పుష్పార్చనము లేక
ప్రవిమలానంద సా ♦ మ్రాజ్యపదవి,
గీ. అమరునే! యెంత ఘనునకు ♦ నైననఁగాని
మీకరుణ లేక గవ్వయేఁ ♦ లోకమునను.
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 75

సీ. తల్లిచెప్పినమాట ♦ తథ్యమ్మనుచు నమ్మి
యడవిదారులఁబడి ♦ నడచినడచి
శ్రమపడి చాల శ్రీ ♦ శైలముఁ జేరియుఁ
బలుచోట్ల వెదకి క ♦ న్పడకయున్న
కడు పట్టుదలతోడఁ ♦ గన్గొని మిమ్ముల
నప్ప బావలటంచు ♦ నరసిభక్తిఁ
దోడ్కొనివచ్చి యొం ♦ తో ప్రేమఁ దల్లియు
దాను మీపూజలఁ ♦ దత్పరమతి
గీ. నశన వసనాదులన్ గల్గి ♦ నంతవట్టు
తోడ మీసేవ యొనరించి ♦ తల్లి భక్త
రాముఁడును వాని జనని మీ ♦ ప్రాపుఁగనిరి
యెట్లుసేవించినను మోక్ష ♦ మిత్తువుగద
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 76

సీ. ఆట, పాటల, విద్య ♦ లభ్యసించుటయందుఁ
గానరాకయ గొంత ♦ కాలము చను
మద, దంభ, మోహాది ♦ మమకారములయందుఁ
గానరాకయగొంత ♦ కాలము చను
పుత్ర, ధన, కళత్ర, భూ, ♦ గృహాదులయందుఁ
గానరాకయ గొంత ♦ కాలము చను
ఆశా, జరాది ము ♦ ఖ్యమగు నవస్థలయందుఁ
గానరాకయ గొంత ♦ కాలము చను
గీ. నహహా ! యీమాడ్కిఁ గాలము ♦ వ్యర్థపఱచి
మనుజు లావలఁ బరితాప ♦ మునఁ గృశింత్రు
బుధజనోల్లాస!.........! పార్వతీశ! 77

సీ. అన్ని జన్మంబులం ♦ దత్యుత్తమంబయి
యలరు మానవజన్మ ♦ మబ్బుటరుదు
అది లభ్యమయిన బ్ర ♦ హ్మకులానఁ బుట్టుట
కడుదుర్లభం బద్ది ♦ గలిగెనేని
పురుషుఁడై పొడముట ♦ కరము దుష్కరమది
గలిగిన సుగుణముల్ ♦ కానఁబడవు
సుగుణముల్ గల్గిన ♦ చూడ్కి నీయందున
నిల్పి సేవించెడి ♦ నేర్పుదోఁప

గీ. దట్టి గుటెనిల్పి మిముఁ జూచు ♦ నట్టివాఁడె
యవ్యయానంద మయుఁడు త ♦ త్త్వార్థవేది!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 78

సీ. పాపమా! నను బ్రోవఁ ♦ గోపమా! నీదివ్య
రూపుఁ జూప వదేమి ♦ పాఁపతొడవ!
పంతమా! నామీఁదఁ ♦ జెంతఁ జేరఁగరా వ
దెంత వేడినఁగాని ♦ దంతిదమన!
నేరమా! ననుఁగావ ♦ భారమా! నన్నేల
బీరమా! నీకింత ♦ క్రూరహరణ!
నేమమా! పాలింపఁ ♦ గామమా! నను వీడ
సేమమా! యిది నీకు ♦ సోమధారి!

గీ. ఏల నన్నేలవింకఁ గృ ♦ పాలవాల
చాలఁగాఁ దూలితిని బ్రోవ ♦ జాలమేల?
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 79

సీ. లక్షాధికారియు ♦ భిక్షాధికారియౌ
మేటి శత్రుండైన ♦ మిత్రుఁడౌను
చెడిపెయైనను గుల ♦ స్త్రీ రత్నమైయొప్పుఁ
బండితుండైనను ♦ బామరుఁడగు
కడుశుంఠయైనను ♦ ఘనయశోవంతుఁడౌ
మంచివాఁడైనను ♦ వంచకుఁడగు
దాతయైనను లోభి ♦ దారి వర్తించును
గుకవియైనను మహా ♦ సుకవియగును

గీ. మూఢుఁడైనను విజ్ఞాన ♦ మూర్తియగును
నీదు మాయావిలాస స ♦ న్నిహితుఁడగుచు
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 80

సీ. వారిధిదాఁటఁగా ♦ వలనగు నొకవేళ
తరమౌనె దాఁటఁగాఁ ♦ దమదుమాయ
శశవిషాణమునెట్లొ ♦ సాధింప వీలగు
తరమౌనె సాధింపఁ ♦ దమనిలయము
శాస్త్రాళినెల్లను ♦ జదువనౌ నొకతఱి
తరమౌనె వచియింపఁ ♦ దమగుణాళి
కడురహస్యము వెలిఁ ♦ బడు నొకయదనున
తరమౌనె దెలియఁగాఁ ♦ దమవిషయము

గీ. నగములను బిండిచేయఁగా ♦ నగు నొకపరి
తరమె మీతత్త్వమెన్నఁగా ♦ ధరణిలోన
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 81

ఆపురమ్ములు గూల్చు ♦ టదియొక లెక్కయా!
యీపురమ్ములఁ గూల్పు ♦ మింకనయిన.
ఈతీర్థసేవల ♦ నేప్రొద్దు వుచ్చెద
వాతీర్థమున స్నాన ♦ మాడఁజేయు
మీప్రసాదము లిచ్చు ♦ టదియొకగొప్పయా!
ఆప్రసాదము కల్గు ♦ నట్లుచేయు
మీజ్ఞానమిచ్చితి ♦ నిఁక జాలునసకను
ఆజ్ఞానమిచ్చి స ♦ న్మానరింపు

గీ. ఇంతవానిని జేయు ట ♦ యెంత? సంత
సింతు, నీయంతవానిఁగఁ ♦ జేయుమయ్య!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 82

సీ. ఆత్మవిచారణా ♦ భ్యాసంబుచేతను
అజ్ఞానమది మొద ♦ లంటఁగూలు
బ్రహ్మపదార్థ సం ♦ భావనాగరిమచే
శత్రుసమూహంబు ♦ సమసిపోవు
వేదాంత విద్యావి ♦ వేకపాటవముచే
నిఖిలేంద్రియ జయమ్ము ♦ నెమ్మినొదవు
జీవేశ్వరైక్య వి ♦ శేషానుభవముచేఁ
బరమసుఖంబును ♦ బడయఁగల్గు

గీ. ననుచు సద్గురుమూర్తివై ♦ మునిజనులకుఁ
దత్త్వమార్గము, మౌనము ♦ ద్రను దెలిపెడి
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 83

సీ. మునిపుత్రునకు నా ♦ యువు నొసంగు టదికల్ల
బోయ నేలుట నట్టి ♦ బూటకంబు
భక్తరామునకును ♦ బావయగుట సున్న
శుకునకు జ్ఞానమి ♦ చ్చుటయు మాయ
బాణుని సంతోష ♦ పఱచు టబద్ధంబు
గొడగూచి నేలుట ♦ గొప్పటక్కు
జగములఁ బ్రోవ వి ♦ షము దిను టనృతంబు
పాపి సంరక్షణ ♦ ప్రథయుబొంకు
గీ. గాని యీతటి నన్నుఁ బ్రేమఁ ♦ గాచితేని
సత్యమగుఁ బైచరిత్రలు ♦ సత్యరూప!
బుధజనోల్లాస!......... ! పార్వతీశ! 84

సీ. బాలురఁ బాలింపఁ ♦ బరుగెత్తుదువుకదా
యీ బాలుఁ బాలింప ♦ నేలరావు?
దీనరక్షణమునఁ ♦ దిరుగుచుందువుకదా
యీ దీను రక్షింప ♦ నేలరావు?
మూఢులఁ గావంగ ♦ మురియుచుందువుగదా
యీ మూఢుఁ గావంగ ♦ నేలరావు?
దుష్టుల నేలెడి ♦ దొడ్డవాఁడవుగదా
యీ దుష్టు నేలంగ ♦ నేలరావు?
గీ. యెట్టివారలనైనఁ జే ♦ పట్టుదొరవు
నన్నుఁ జేపట్ట విదియేమి ♦ న్యాయమయ్య!
బుధజనోలాస!......... ! పార్వతీశ! 85

సీ. ఇద్దరాంధ్రనుగూడి ♦ ముద్దుగా నొకశయ్య
మెలఁగి సౌఖ్యనతండ్రి ♦ మేలుకొనుము!
భక్తుల, దీనులఁ ♦ బరిపాలనముఁజేయు
మేటివౌ నాతండ్రి ♦ మేలుకొనుము!
పుట్టింపఁ, బోషింపఁ, ♦ బొలియింప, మాయలఁ
జాలనేర్చినతండ్రి ♦ మేలుకొనుము!
నిర్నిద్రమతివయ్యు ♦ నిద్రవో యెడిమాడ్కి
మెలఁగెడు నాతండ్రి ♦ మేలుకొనుము!
గీ. సర్వజగముల మేల్కొల్పు ♦ చతురమతివి
మేలుకొను! నాదుమొఱవిని ♦ మేలుకొనుము!
బుధజనోల్లాస!.........! పార్వతీశ! 86

సీ. రార సుందరరూప! ♦ రార చంద్రకలాప!
రార గుణకదంబ! ♦ రార సాంబ!
రార గౌరీధవ! ♦ రార మహీధవ!
రార సన్నుతమార్గ! ♦ రారభర్గ!
రార కిల్బిషనాశ! ♦ రార వియత్కేశ!
రార శైలనివేశ! ♦ రార యీశ!
రార దివ్యచరిత్ర! ♦ రార సన్నుతిపాత్ర!
రార ధవళగాత్ర! ♦ రా త్రినేత్ర!
గీ. రార మృదుభాష! ఖలశోష! ♦ రా సువేష!
రమ్ము నను్రోవ వేగ రా ♦ రమ్ము దేవ!
బుధజనోల్లాస!.........! పార్వతీశ! 87

సీ. ఇంద్రాదిదేవతా ♦ బృందసంస్తుతిగొన్న
కమనీయవేష! స్వా ♦ గతము నీకు
గజదశకంఠాది ♦ ఘనదైత్యనుతిపాత్ర
కామవిశోష! స్వా ♦ గతము నీకు
లోకకల్యాణ వి ♦ లోకన తత్పర!
తతమృదుభాష! స్వా ♦ గతము నీకు
భక్తగృహాంగణ ♦ పారిజాతంబవౌ
కమలారిభూష! స్వా ♦ గతము నీకు
గీ. నతులకరుణాస్వరూప! స్వా ♦ గతము నీకు
వితతవిజ్ఞానమూర్తి! స్వా ♦ గతము నీకు
బుధజనోల్లాస !.........! పార్వతీశ! 88

సీ. నీవె నాతల్లివి, ♦ నీవె నాతండ్రివి,
నీవె సోదరుఁడవు, ♦ నీవె పతివి,
నీవె చుట్టంబవు, ♦ నీవె స్నేహితుఁడవు,
నీవె నాపెద్దవు. ♦ నీడ నీవె,
నీవె సద్గురుఁడవు, ♦ నీవె నావేల్పవు,
నీవె నాగమ్యము, ♦ నీవె దిక్కు,
నీవె నాకర్తవు, ♦ నీవె నాభోక్తవు,
నీవె నానేతవు, ♦ నీవె గతివి.
గీ. నాదు సర్వస్వమవు నీవె, ♦ నన్ను నీట
ముంచెదో! పాలముంచెదో! ♦ యెంచిచూడ
నీదెపో భారమంతయు ♦ నిత్యసుఖద!
బుధజనోల్లాస !.........! పార్వతీశ! 89

సీ. ఆత్మయే నీరూప ♦ మగును విచారింప,
మతియె దాఁ బార్వతీ ♦ మహిళయగును,
ప్రాణంబులైదును ♦ పరిజనులగు నీకు,
దేహమేనీదగు ♦ గేహమగును,
భోగాదులే దివ్య ♦ పూజలౌ నీకిల,
నిద్ర సమాధియౌ ♦ భద్రముగను,
అరయఁ బ్రదక్షిణం ♦ బౌను సంచారంబు,
మాటలే నీదగు ♦ పాటలగును,
గీ. ఎట్టి కర్మంబుచేసిన నేను నీకె
యర్పితమటంచు నూహింతు నధికభక్తి
బుధజనోల్లాస !.........! పార్వతీశ! 90
సీ. బాలామనోవీధిఁ ♦ బలు వేసములు వేసి
తిరుగువాఁ డెనలేక ♦ తిరుగువాఁడు,
లయమొనర్పఁగఁ బెంప ♦ లలిసృష్టియొనరింపఁ
జాలువాఁడౌఁ దల ♦ జాలువాఁడు,
కరమున నిస్త్రింశతోఁ ♦ గడుశోభ నిచ్చలు
వెలుఁగువాఁడలమేన ♦ వెలుఁగువాఁడు,
విన్ను కొమ్ముడిపాఁప ♦ మన్నీలు తొడవులై
యొప్పువాఁడును మెడ ♦ కప్పువాఁడు,
పొడలగింజెమువాఁడు ♦ నుడివోని సిరులచే
వెల్గువాఁడును మేలి ♦ యల్గువాఁడు,
గీ. బాలశశిశేఖరుఁడు కృపా ♦ పరుఁడటంచు
నిన్ను సేవించుచుందురు ♦ నీతిమతులు
బుధజనోల్లాస !.........! పార్వతీశ! 91

సీ. శ్రీకరలక్షణా ♦ ంచిత దివ్యశుభపాద!
అనుకంపతోడ న ♦ న్నరయరాద!
నీవాఁడ నన్నవా ♦ నిం బ్రోవమర్యాద!
పతితులఁ ♦ బాలించు ప్రజ్ఞలేద!
శరణాగతత్రాణ ♦ బిరుదంబు విడిపోద!
తాళి నన్నేల నే ♦ మైనవాద!
చెప్పెడిదేమి నా ♦ చేతఁ గాదనరాద!
తప్పునన్నుఁ జెప్పిన ♦ నొప్పుఁ గాద!
గీ. అయ్యొ! మొఱతీసిమాట ని ♦ న్నంటి శ్రీద!
నిత్యతృప్తినిఁ బరపుమీ ♦ దీనుమీఁద
బుధజనోల్లాస! సొంపుల ♦ పూఁడివాస!
భక్తహృదయనివేశ! మల్లేశ! ♦ పార్వతీశ! 92

సీ. శూలంబు, కీలంబు, కేల, ♦ ఫాలంబున,
లీలగాఁ దాల్చిన ♦ మూలపురుష!
నాగజను, గిరిజను, ♦ శిరమునఁ, బరమందు,
ధరియించి, భరియించి, ♦ పరగువరద!
నగరాజు, గిరిరాజు, సరి, ♦ శరాసనములై
మెఱయుచుఁ ♦ దిరిగెడి యురగభూష!
తారారాజు, నీరరాజు, ♦ గారాబునెఱకాఁడు,
సారథమ్యై, గేరు ♦ మేరుధీర,
గీ. యీశ! భూతేశ! సర్వేశ! ♦ పాపనాశ!
రక్షణవిచక్ష! రుద్రాక్ష ♦ వక్ష! దక్ష!
బుధజనోల్లాస !.........! పార్వతీశ! 93

సీ. శ్రీసర్వమంగళా ♦ చిత్తాబ్జసద్భృంగ!
భృంగిరిటాది సే ♦ వితపదాబ్జ!
అబ్జజాండాధిప! ♦ యస్ఖలితవరదాన!
దానవసంహార ♦ ధనదమిత్ర!
మిత్రతుపాకర, ♦ మేషవాహననేత్ర!
నేత్రసంధాహిత ♦ నీరజశర!
శరజన్మజనక! భూ ♦ షాయితమణిచూడ!
చూడాకలితగంగ ♦ సుప్రభావ!

గీ. భావనాతీత! దివ్యప్ర ♦ భావమూర్తి!
మూర్తిత్రితయాత్మ! వందారు ♦ ముఖ్యవిబుధ!
బుధజనోల్లాస !......... ! పార్వతీశ! 94

సీ. వాదభేదవిదూర! ♦ నాదానుసంధాన!
శ్రీద! విదారిత ♦ మోదఖేద !
భర్గ! దుర్గాధిప! ♦ నిర్గుణ! సన్మార్గ!
నిర్గతరిపువర్గ! ♦ గర్గవంద్య!
శంకర! పాపనా ♦ శంకర! దుష్టభ
యంకర! బాలాంక! ♦ సంకటహర!
చిత్రచారిత్ర! ప ♦ విత్ర! త్రినేత్ర! సర్వ
మిత్ర! ధవళగాత్ర! ♦ స్తోత్రపాత్ర!

గీ. పాశధర! పాపనాశక! ♦ పాపరహిత!
పాలనముసేయుమింక నీ ♦ పాలఁబడితి
బుధజనోల్లాస !......... ! పార్వతీశ! 95

సీ. కరిశిక్షకుఁడవీవు ♦ కరిరక్షకుఁడు శౌరి
అతనికి నీకు వ్య ♦ త్యాసమేమొ?
మఖశోషకుఁడవీవు ♦ మఖపోషకుఁడు హరి
ఏమిభేదంబో? మీ ♦ కెంచిచూడ
కాము నొంచితివీవు ♦ కాముఁ బెంచెను శౌరి
అతనికి నీకు వ్య ♦ త్యాసమేమొ?
ప్రకృతిహర్తవునీవు ♦ ప్రకృతికర్తము రారి
ఏమిభేదంబో? మీ ♦ కెంచిచూడ

గీ. నీవ శౌరివి శౌరియే ♦ నీ వుభయులు
సంతతము వెల్గుమూర్తులు ♦ సత్యమింత
బుధజనోల్లాస !.........! పార్వతీశ! 96

సీ. ఫణినిఁ జుట్టితివీవు ♦ ఫణిని మట్టెనతండు
యిరువురకును భేద ♦ మింత లేదు
మృగము మెచ్చితివీవు ♦ మృగముద్రవచ్చెనతండు
నిరువురకును భేద ♦ మింత లేదు
గిబ్బఁ బ్రోచితివీవు ♦ గిబ్బ నేచె నతండు
యిరువురకును భేద ♦ మింత లేదు
దైత్యునెంచితివీవు ♦ దైత్యు నొంచెనతండు
యిరవురకును భేద ♦ మింత లేదు

గీ. అఖిలజీవుల హృదయకు♦ హరములందు
వెల్గుచుంద్రు సదాయేక ♦ విధముగాను
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 97

సీ. దైత్యారివీవును ♦ దైత్యారి యాతండు
మాధవునకు నీకు ♦ భేదమున్నె!
పశుపతివీవును ♦ బశుపతి యాతండు
మాధవునకు నీకు ♦ భేదమున్నె!
దామోదరుఁడ వీవు ♦ దామోదరుఁ డతండు
మాధవునకు నీకు ♦ భేదమున్నె!
శ్రీధరుండవు నీవు ♦ శ్రీధరుండాతండు
మాధవునకు నీకు ♦ భేదమున్నె!
గీ. గాని కొందఱు భేదంబు ♦ గలదటంచు
వసుధఁగావింత్రు వాదోప ♦ వాదములను
సద్గతులు వారికున్నవే ♦ చర్చసేయ
బుధజనోల్లాస! దొప్పల ♦ పూఁడివాస!
భక్తహృదయేశ! మల్లేశ! ♦ పార్వతీశ! 98

సీ. నీదాసజనులలో ♦ నే నొకండనుటకు
భావింప హేతువు ♦ భక్తియొకఁడె,
విజ్ఞాన సంపత్తి ♦ వెలయఁ జేయుటకును
భావింప హేతువు ♦ భక్తియొకఁడె,
నినుజెందు మార్గంబు ♦ గనిపింపఁ జేయఁగా
భావింప హేతువు ♦ భక్తియొకఁడె,
నీలోనఁ గలిసెడి ♦ నెఱి ఘటించుటకుఁగా
భావింప హేతువు ♦ భక్తియొకఁడె,
గీ॥ వేఱుహేతువు గనరాదు ♦ వెదకిచూడ
నఖిలమునకును దారకం ♦ బదియకాదె,
బుధజనోల్లాస: .........! పార్వతీశ ! 99

సీ॥ వీఁడటే! తత్త్వవి ♦ వేకంబు చిన్ముద్ర
చే బోధఁ జేసిన ♦ చిన్నవాఁడు
వీఁడటే! నిరుపేద ♦ విధమునఁ గన్పట్టి
తనబారి నన్నింటఁ ♦ దనుపువాఁడు
వీఁడటే! యెన్నని ♦ విలయముల్ గల్గిన
సురుగని దివ్య తే ♦ జోమయుండు
వీఁడటే! యీ మహా ♦ విశ్వనాటక సూత్ర
ధారియై యొప్పుము ♦ దావహుండు
గీ॥ వీఁడటే! దేవదేవుండు ♦ విశ్వమయుఁడ
టంచు నిన్నుఁ జింతించెద ♦ రార్యవరులు
బుధజనోల్లాస !......... ! పార్వతీశ ! 100

సీ॥ క్షరుఁడ వక్షరుఁడవు ♦ సర్వసాక్షివి జ్ఞాన
గోచరుండవు మహా ♦ గోపనుండ
వప్రమేయుండవు ♦ స్వప్రకాశుండవు
పరిపూర్ణుఁడవు మహా ♦ బలయుతుఁడవు
శుద్ధసత్త్వుండవు ♦ శుభచరిత్రుండవు
సర్వజ్ఞుఁడవు జీవ ♦ సంజ్ఞితుఁడవు
సర్వకారణుఁడవు ♦ నుర్వింభరుండవు
నద్వితీయుండవు ♦ నవ్యయుఁడవు
గీ॥ పరముఁడవు సచరాచర ♦ ప్రకృతి కర్త
వగుచుఁ జెన్నొందు నిన్ను నే ♦ నభినుతింప
నెంతవాఁడను దయతోఁడ ♦ నేలు తేఁడ!
బుధజనోల్లాస ! .........! పార్వతీశ ! 101

సీ. సర్వవిఘ్నంబుల ♦ సదమదం బొనరింప
విఘ్నేశ్వరుండు నా ♦ వెంటనుండ,
ఘోరశత్రువులను ♦ మాటిమసంగను
వీరభద్రుండు నా ♦ వెన్కనుండ,
భక్తిపద్ధతి, జ్ఞాన ♦ పద్ధతిఁ, దెలుపంగ
నందీశ్వరుండు నా ♦ ముందునుండ,
ధైర్యంబుచే గొప్ప ♦ దగుపనిఁ సాధింప
విలని స్కందుఁడు ♦ వినుచుచుండ,
గీ. ప్రమథగణములు శుభములు ♦ పలుకుచుండ
దండియగునండవయి నీవు ♦ దండనుండ
నాకుఁగలదె కొంత పి ♦ నాకపాణి!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 102

సీ దాసుఁడనంచు నీ ♦ దరిఁ జేరితినిగాని
యన్యభావమున ని ♦ న్నరయలేదు
ప్రేమఁజూచెదవంచుఁ ♦ బ్రేమించితినిగాని
యితరభావమున ని ♦ న్నెన్నలేదు
పరమగురుఁడవంచుఁ ♦ బదములంటితిఁగాని
వేఱుభావమున ని ♦ న్వేడలేదు
దండిదొరవటంచు ♦ నండఁజేరితిఁగాని
పెరభావమున నిన్ను ♦ దరియలేదు
గీ. బాబు! వీనిని రక్షించు ♦ భారమంత
నీ యధీనంబ కృపఁజూడు ♦ నిర్మలాత్మ!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 103

సీ. సామీనుఁ గైకొన్న ♦ చాన! నీవైనను
నామాట శీఘ్రమది ♦ నాటఁ జెపుమ!
పతిశిరమ్మెక్కిన ♦ పణఁతి! నీవైనను
నామొఱ భవ్యమది ♦ నాటఁ జెపుమ!
మౌళిని నెలకొన్న ♦ మరుమామ! నీవైన
నాగోలశూలికి ♦ నాటఁ జెపుమ!
కరముననున్న మృ ♦ గంబ! నీవైనను
నాస్థితి హరుచెవి ♦ నాటఁ జెపుమ!
గీ. అనుచుఁ జెప్పించితని మదిఁ ♦ గినియవలదు
వేగ రక్షింతువనెడి యా ♦ వేశమునను
నాడుమాటలుగాని య ♦ న్యములుగావు
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 104

సీ. నాతండ్రి నన్నేలు ♦ నాయిష్టదైవమ!
నన్ను మన్ననసేయు ♦ నాగభూష!
దీనుఁడనైయుంటి ♦ దిక్కు నీవేయంటి
దారిఁజూపుమఁటంటి ♦ దాసపోష!
జన్మమూలముఁగూర్చి ♦ చాల యోజింపఁగఁ
జిత్రమైతోఁచు వి ♦ చిత్రవేష!
తప్పులోఁ యొప్పులో ♦ చెప్పించితివిగానిఁ
దప్పులెల్లనునావె ♦ తాపశోష!
గీ. ఆర్తజనలోల! దయయుంచు ♦ మాటిఁజాల!
చిత్తగింపుఁడశ్రద్ధను ♦ జేయక నిటు
లను విధేయుఁడ "బాపయ్య" ♦ యనెడివాఁడ
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 105

సీ. కరములచేఁగాని, ♦ చరణంబులనుగాని,
కర్మచేఁగాని, వా ♦ క్కులనఁగాని,
మేనిచేతనుగాని, ♦ జానువులనుగాని,
చక్షువులను మాన ♦ సమునఁగాని,
విహితంబుననుగాని, ♦ యహితమ్మునంగాని,
కాక మఱెట్టి మా ♦ ర్గమునఁగాని,
అన్న! నా జేయు స ♦ ర్వాపరాధంబులు
క్షమియించు మంటి నిన్ ♦ శరణమంటి,
గీ. కరుణ నర్థించుచుంటి నిన్ ♦ గావుమంటి
నార్తజనరక్ష! ఫాలాక్ష! ♦ ధూర్తశిక్ష!
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 106

సీ. ఈభక్తహృదయమ్ము ♦ నెపుడుపఠించిన
భక్తులౌదురుగాత ♦ వసుధజనులు;
ఈ స్తవమాలను ♦ నింపుగా వ్రాసిన
ధన్యులౌదురుగాత ♦ ధరణిజనులు;
ఈపద్యరత్నంబు ♦ లెలమితో వినినను
జ్ఞానులౌదురుగాత ♦ జగతిజనులు;
ఈస్తోత్రజాలమ్ము ♦ నెంతయుఁ బ్రేమింపఁ
బూజ్యులౌదురుగాత ♦ పుడమిజనులు;
గీ. భూమి నాచంద్రతారార్క ♦ ముగఁ ద్వదీయ
కృపను వర్ధిలుఁగాత నీ ♦ కృతి శుభగతి
బుధజనోల్లాస! .........! పార్వతీశ! 107

సీ. మంగళంబిదె సర్వ ♦ మంగళాధీశ్వర!
మంగళం బధ్వర ♦ భంగమూల!
మంగళం బనుపమ ♦ మాహాత్మ్యసంయుత!
మంగళంబు త్రిలోక ♦ మాననీయ!
మంగళం బజ్ఞాన ♦ మాయాపహారక!
మంగళం బానంద ♦ మయ సహృదయ!
మంగళంబు ప్రకృతి ♦ మంగళరూపక!
మంగళం బంతక ♦ మదవిభేద!
గీ. మంగళంబు త్రయీవేద్య ♦ మాన్యచరిత!
మంగళం బంగజాంతక! ♦ సంగదూర!
బుధజనోల్లాస! ........! పార్వతీశ! 108

సీ. ఐకమత్యముగల్గి ♦ యఖిల జనమ్ములు
వర్ధిల్లుచుండుగాత ♦ స్పర్ధ లేక
శౌర్య, ధైర్య, క్షమా, ♦ సత్య, దయాబ్ధులై
వర్ధిల్లుచుండుగాత ♦ పరీక్షనమున
తాఁదరించెడి మంచి ♦ దారిఁ గన్గొని ప్రాణి
వర్గముచ్చైస్థితిఁ ♦ బడయుఁగాత
సర్వసస్యసమృద్ధి ♦ సౌభాగ్యగరిమమ్ము
గలిగి దేశము ఖ్యాతిఁ ♦ గాంచుగాత
గీ. జయము, యశమును, శుభమును, ♦ సంపదలును
గలుగుఁగావుత నీకటా ♦ క్షమునఁ బ్రజకు
బుధజనోల్లాస! దొప్పల ♦ పూఁడివాస!
భక్తహృదయేశ! మల్లేశ! ♦ పార్వతీశ! 109

# దండకము.

శ్రీమన్మహా దేవదేవా! సదానందభావా! దయన్ గావ రావా! మహాశూలహస్తా! త్రిలోకప్రశస్తా! శరన్నీరదాంగా! మనోజాతభంగా! మృగాంకోత్తమాంగా! స్ఫురత్ సత్త్వసంగా! యుదన్వన్నిషంగా! మహోద్యచ్చరిత్రా! సురస్తోత్రపాత్రా! రవీంద్వగ్ని నేత్రా! ఘనాం హోనిరాసా! లసద్దివ్యభాసా! భుజంగేంద్రభూషా! మదోద్రేక రాత్రించరవ్యూహశోషా! జ్వలత్తారహారా! సదానిర్వికారా! మహామేరుధీరా! భవద్దివ్యలీలావిశేషంబు లెంచంగ నేనెంతవాఁడన్ భవవ్యాధిఁ బోఁద్రోలి నన్ బ్రోవు వేల్పా! పరా! నిర్వికల్పా! నినున్ గానఁగాలేక కామాదులంజిక్కి కాలంబు వ్యర్థంబుగాఁ బుచ్చుచుంటిన్ నినున్ జేరనౌ మంచిమార్గంబిదే తెల్పుమంటిన్ భవద్దాస దాసాను దాసుండనంటిన్ కృపం జూపుమంటిన్ నిను న్నమ్మియుంటిన్ హరా! శంకరా! దివ్యరూపా! స్వమాయాకలాపా! స్థిరత్వంబు లేనట్టి సంసారమోహంబు వోఁజించి జ్ఞానంబుగల్గించి, నాయార్తిఁ దూలించి నన్నేలు ముమ్మాటికిన్ నాదుకర్మంబు, ధర్మంబు, సర్వంబునున్ నీకె యర్పించితిన్ నాదుసర్వస్వమున్ నీవెయంచున్ మదిన్నమ్మితిన్ నన్నుఁ జేపట్టుమో చిద్విలాసా! పుటగ్రామవాసా! లసద్భాసభాసా! నమస్తే! నమస్తేనమః!

---

# గద్య

ఇది శ్రీ పార్వతీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కాశ్యపసగోత్ర పవిత్ర పొన్నూరువంశ పయఃపారావార రాకాకుముదమిత్ర మహాలక్ష్మమాంబా పున్నయార్యపౌత్ర కామాక్షమాంబా దుర్గయార్యపుత్ర సుజనమిత్ర సూరిజన విధేయ బాపయనామధేయ ప్రణీతంబైన భక్తహృదయంబను మల్లేశ్వర స్తవము సర్వము సంపూర్ణము.

మంగళంమహత్.

# వందే శివం శంకరమ్.

వందేశంభుముమాపతిం సురగురుం వందే జగత్కారణం
వందేపన్నగభూషణం మృగధరం వందే పశూనాంపతిమ్
వందేసూర్యశశాంకవహ్ని నయనం వందే ముకుందప్రియమ్
వందేభక్తజనాశ్రయంచ వరదం వందే శివంశంకరమ్.

వందేశంకర మర్ధచంద్రమకుటం వందే భుజంగాంగదమ్
వందేమారహరం పురత్రయహరం వందే గణానాంపతిమ్
వందేభస్మవిలేపినం త్రిణయనం వందే సురేశప్రియమ్
వందేభక్తజనాశ్రయంచ వరదం వందే శివం శంకరమ్.

వందేరుద్రమనంత మక్షయపదం వందే త్వఖండాకృతిం
వందేభూధరకార్ముకం హరిశరం వందే కుమారాత్మజం
వందేదక్షహరం విషోజ్వలగళం వందే జగత్ప్రాభవమ్
వందేభక్తజనాశ్రయంచ వరదం వందే శివం శంకరమ్.

వందే ఈశ్వర మష్టమూర్తిమమలం వందే సురాణాంగురుం
వందేసిద్ధజనాశ్రయంచ శుభదం వందే మృడంశూలినం
వందేమత్తగజేంద్ర దానవహరం వందే గణేశప్రియం
వందేభక్తజనాశ్రయంచ వరదం వందే శివం శంకరమ్. ౪

వందేశర్వమనాకృతిం మునినుతం వందేచ గంగాధరం
వందేపుష్కరకేశ మంధకరిపుం వందే వృషాంకధ్వజం
వందేవాసుకిభూషణం పరశివం వందే గిరీశంహరం
వందేభక్తజనాశ్రయంచ వరదం వందే శివం శంకరమ్. ౫

వందేభర్గమనర్ఘ భూషణధరం వందే మహాత్కారణం
వందేశంధినిమంగ మర్జునతనుం వందే కృతివ్యాపకం
వందేవిశ్వమయం పురందరనుతం వందే ధరిత్రీధరం
వందేభక్తజనాశ్రయంచ వరదం వందే శివం శంకరం. ౬

వందేరావణ చండికార్చిత పదం వందే గురూణాంగురుం
వందేదేవరిపు ప్రణాశనకరం వందే కృపాసాగరమ్
వందేకంకణ శబ్దభాసితకరం వందే జగజ్జీవనమ్
వందేభక్తజనాశ్రయంచ వరదం వందే శివం శంకరమ్. ౭

వందేధూర్జటిమన్మథాపహరణం వందే క్రతుధ్వంసినం
వందేసూక్ష్మమనంతరూప ఫలదం వందే పరందైవతమ్
వందేనీలగళం మృగాంకశిరసం వందే సురేశంవిభుమ్
వందేభక్తజనాశ్రయంచ వరదం వందే శివం శంకరమ్. ౮



# భజగౌరీశమ్.

**భజగౌరీశం, భజగౌరీశం, గౌరీశంభజ, మందమతే!**

జడభవదుస్తర, జలధిసుతరణం, ధ్యాయంచిత్తే, శివహరచరణం
అన్యోపాయం నహినహిసత్యం, గేయంశంకర, శంకర, నిత్యం॥ భజ॥ ౧

దారాపత్యం క్షేత్రంవిత్తం, దేహంగేహం, సర్వమనిత్యం
ఇతిపరిభావయ, సర్వాసారం, గర్భవికృత్యా, స్వప్నవిచారః॥ భజ॥ ౨

మలవైచిత్ర్యేపునరావృత్తిః, పునరపిజననీ జఠరోత్పత్తిః
పునరప్యాశాకులితం జఠరం, కిం నహిముంచసి కథమేచిత్తం॥ భజ॥ 3

మాయాకల్పితమైంద్రంజాలం, నహితత్సత్యం దృష్టివికారం
జ్ఞాతేతత్త్వేసర్వమసారం, మాకురుమాకురు, విషయవిచారం॥ భజ॥ ౪

రజ్జౌసర్పభ్రమణారోప, స్తద్వద్బ్రహ్మణి జగదారోపః
మిథ్యామాయామోహవిచారం, మనసి విచారయవారంవారం॥ భజ॥ ౫

అధ్వరకోటీగంగాగమనం, కురుతేయోగం చేదింద్రియదమనం
జ్ఞానవిహీనేసర్వమతేన, నభవతిముక్తిర్జన్మశతేన॥ భజ॥ ౬

సోహంహంసో బ్రహ్మైవాహం, శుద్ధానందస్తత్త్వపరోహం
అద్వైతోహం సంగవిహీనే, చేంద్రియ ఆత్మనినిఖిలేలీనే॥ భజ॥ ౭

శంకర, కింకర, మాకురుచింతా, చింతామణినావిరచితమేతత్
యస్సద్భక్త్యా, పఠతిహినిత్యం, బ్రహ్మణిలీనోభవతిహిసత్యం॥ భజ॥ ౮

(మహర్షి)

# వంశావళి.

## సీసమాలిక.

---

శ్రీకరంబగు భవ ♦ చ్ఛీర్షంబునందుండి, జనియించె దూర్వాస ♦ మునివరుండు
ఆతని దేహంబు ♦ నందుండి శ్రీయాది శైవులుద్భవమంది ♦ జగతి వెలసి
రవ్వారిలోన, కా ♦ శ్యపసగోత్రంబులై, వంగడంబులుకొన్ని ♦ వాసిగాంచె,
వానిలో పొన్నూరు♦వంశంబుగొప్పదై కొమరొంది యాదిమూఁడు♦కుదురులయ్యె,
అందుమాకుదురున ♦ కరయఁగా, గుల్లింగ శాస్త్రి తాప్రథముఁడై ♦ సరసముగను
వీరమ్మయను మంచి ♦ వెలఁదినిచేపట్టి, పుత్రులిద్దఱఁగాంచి ♦ పొలుపుమించె,
నందులో జ్యేష్ఠుఁడై ♦ యలరారు కామయ్య, అచ్చమాంబను బెండ్లి♦యాడిపుత్ర,
పంచకంబునుగాంచి♦ప్రథితుఁడై యలరారె, సయ్యైదుగురను బా♦పయ్య, మొదటి
వాఁడు, దాగ్రహియించె ♦ వరమహాలక్ష్మిని, ముగ్గుఱుపుత్రుల ♦ముచ్చటఁగనె,
వారిలో రెండవ ♦ వాఁడు పున్నయ్య నాఁ జెలువొంది మహాలక్ష్మి♦ చెట్టవట్టి
సంతానహీనతఁ ♦ జింతించి యగ్రజు, కొమరు రెండవవాని ♦ గొనియె దత్తు,
వారు శ్రీదుర్గయా♦హ్వయులయి చెన్నొంది మానితబింబ కా♦మాక్షమాంబ
నుద్వాహమయి వేడ్క♦నొకఁడనన్నను, పుత్రికాత్రయమ్మను గాంచి♦ఘనతఁగనిరి
బాపయ్య యని పిల్వ♦బడువాఁడనేను నాకును, నొక్కకన్యకఁ♦ గూర్చినారు,

గీ. జనని కీర్తికాయంబున♦మనిన పిదప, జనకునే భక్తిఁగొలుచుచు♦సంతసమున,
త్వత్కృపాలేశమునఁ గూర్ప♦దగినవాఁడ, నయితి నీ స్తవమాలను♦హాసభాస!
బుధజనోల్లాస! దొప్పల♦పూఁడివాస! భక్తహృదయేశ! మల్లేశ! ♦ పార్వతీశ!



